Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 8 • 24-2-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




# ఈ కేసులు నిన్నేమీ చేయలేవు

## జగన్‌కు రాంజత్మలానీ హామీ?

సిబిఐ కేసుల యమపాశం నుంచి తనకు విముక్తి కల్పించమని వైఎస్.జగన్ తొక్కని గడప లేదు. మొక్కని దేముడు లేడు. ఏసు ప్రభువు అండ కోసం జెరూసలేం కూడా వెళ్లి వచ్చినా ఫలితం దక్కలేదు. సోనియమ్మ కరుణ కోసం ఇంద్రప్రస్థానికి ఎన్ని రాయబారాలు, బేరాలు నడిపినా అభీష్టం సిద్ధించలేదు. అయితే ఎడారిలో దారి తప్పిన బాట సారికి ఒయాసిస్సు ఎదురొచ్చినట్లు, రాంజత్మలానీ అశీర్వాదం లభించింది ఇప్పుడాయనకు. రాంజత్మలానీ అంటే, నందిని పంది, పందిని నంది చేయగల న్యాయ మాంత్రికుడు. ఆయన కోటు ధరించి కోర్టులో నోరు విప్పితే కొమ్ములు తిరిగిన న్యాయాధీశులు సైతం సావధానంగా చెవులు రిక్కించి వింటారు. తన వాదనా పటిమతో కుందేలు పిల్ల అంటే కోరలున్న రక్త పిపాసి అని నిరూపించగలడు. కొదమసింహం అంటే సాత్వికాహారం తినే సాధు జంతువని రుజువు చేయగలడు. ప్రఖ్యాత స్మగ్లర్ హాజీ మస్తాన్ నుంచి, పార్లమెంట్ మీద దాడి చేసిన అఫ్జల్ గురు వరకు దేశ చరిత్రలో నిలిచిపోయిన ఎందరో నేరస్తులకు న్యాయవాదిగా పనిచేసిన వాడాయన. ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ హంతకులకు కూడా న్యాయవాది ఆయనే. న్యాయ శాస్త్రాన్ని ఆయన వలె ఔపోసన పట్టినవారు చాలా అరుదు. దేశంలో అత్యంత ఖరీదైన న్యాయవాదిగా కూడా రాంజత్మలానీకి పేరు వుంది. ఒక్కొక్క కేసు వాదించడానికి ఆయన రోజుకు కోటి రూపాయల వరకు తీసుకొంటాడని వదంతులున్నాయి.

అంతటి న్యాయ కోవిదుడైన రాంజత్మలానీ ఇప్పుడు వైఎస్.జగన్‌కు శ్రీరామరక్షగా నిలుస్తున్నాడు. జగన్ అక్రమ ఆస్తులకు సంబంధించి సిబిఐ పెట్టిన, పెడుతున్న కేసులు న్యాయస్థానాలలో నిలవజాలవని ఆయన తేల్చి చెప్పాడని తెలుస్తున్నది. నువ్వు ఏ పదవిలోనూ లేవు కాబట్టి, అధికార దుర్వినియోగం,

కొరవ 14వ పేజీలో

# పీక నులమవద్దు

భారత్, పాకిస్తాన్‌లు రెండూ ఒకే రోజు స్వతంత్ర రాజ్యాలుగా అవతరించాయి. కానీ భారతదేశం ప్రపంచం ఆశ్చర్యపడే రీతిలో సుస్థిరమైన ప్రజాస్వామిక దేశంగా పరిణతి సాధిస్తే, పాకిస్తాన్ మాత్రం సైనిక నియంతృత్వంలో అల్లాడి పోతున్నది. ఈ రెండింటికి మధ్య ఇంత తేడాకు ప్రధాన కారణాలు రెండు. మొదటిది, రాజకీయ ప్రమేయం లేని సైనిక బలగం, రెండవది పటిష్టమైన ఎన్నికల వ్యవస్థ. పాకిస్తాన్ వలెనే భారతదేశం కూడా ఈ అరవై ఐదేళ్ల కాలంలో ఎన్నో రాజకీయ ఆటుపోట్లు ఎదుర్కొన్నది. కానీ ఏ రోజు కూడా ఏ జాతీయ నేత కూడా రాజకీయ విభేదాలను సైనిక జోక్యంతో పరిష్కరించుకోవాలని ప్రయత్నం చేయలేదు. 1975 నాటి అరాచక పరిస్థితులలో సైతం ఇందిరమ్మ సైన్యాన్ని రాజకీయాలకు దూరంగా పెట్టింది.

మన ఎన్నికల కమిషన్‌కు ప్రపంచవ్యాప్త ఖ్యాతి వుంది. ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లు వంటి అమెరికా, ఐరోపా దేశాలు సైతం మన ఎన్నికల కమిషన్ అనుభవాల నుంచి పాఠాలు నేర్చుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాయంటే, దాని స్వతంత్ర పోకడ ఎంత పవిత్రమైనదో అర్థం చేసుకోవచ్చు. టిఎన్.శేషన్ ప్రధాన ఎన్నికల కమిషనర్ అయిన తర్వాత దీని స్వరూప స్వభావాలను మరింత సుదృఢం చేశాడు. ఎన్నికలు నిష్పక్షపాతంగా, స్వేచ్ఛగా, స్వచ్ఛంగా, సమన్యాయంతో నిర్వహించే సత్సాంప్రదాయాన్ని సువ్యవస్థీకృతం చేశాడు. ఆనాటి నుంచి ఎన్నికల కమిషన్ అంటే రాజకీయవాదులకు గుండెల్లో దడ. ఎంతటి కొమ్ములు తిరిగిన ధీరుడైనా సరే ఎన్నికలలో పోటీ చేయాలంటే క్రమశిక్షణకు కట్టుబడక తప్పని పరిస్థితి సృష్టించాడు టిఎన్.శేషన్. ఆ తర్వాత వచ్చిన ఎన్నికల కమిషనర్లందరూ ఆ నమూనాను యదాతథంగా కొనసాగించడంతో దేశంలో ఎన్నికల వ్యవస్థ ప్రజలలో అపారమైన విశ్వాసాన్ని చూరగొన్నది. ప్రజాస్వామ్యం మూడుపువ్వులు ఆరు కాయలుగా వర్థిల్లడానికి ఆ విశ్వాసమే మూలం.

ఇంతకాలం ఏ రాజకీయ పార్టీ కూడా ఈ ఆదర్శ ప్రాయ ఎన్నికల వ్యవస్థను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నం చేయలేదు. కష్టమైనా నిష్టూరమైనా ఆ నియంత్రణ చట్రం లోనే నడుచుకోవడం అలవాటు చేసుకొన్నాయి. కానీ దురదృష్టవశాత్తు దాన్ని భగ్నం చేయాలనే దురాలోచన చేస్తున్నది కేంద్రంలోని కాంగ్రెస్ సర్కార్. ఉత్తరప్రదేశ్ ఎన్నికలలో ఎట్లయినా గెలవాలనే కక్కుర్తితో తప్పటడుగు వేస్తున్నది. కేంద్ర న్యాయశాఖ మంత్రి సల్మాన్ ఖుర్షీద్ మొదటగా ఈ కుట్రకు బీజం నాటాడు. ఉత్తరప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో భాగంగా ఆయన ముస్లింలకు రిజర్వేషన్లలో ఉప కోటా ఇస్తామని ప్రకటించడం మోడల్ కోడ్ ఉల్లంఘన అని ఎన్నికల కమిషన్ ఎంత గట్టిగా హెచ్చరిక చేసినా లెక్క చేయలేదు. దానితో ప్రధాన ఎన్నికల కమిషనర్ ఖురేషీ ఆయనపై రాష్ట్రపతికి ఫిర్యాదు చేయవలసి వచ్చింది. రాష్ట్రపతి ప్రతిభా పాటిల్ దానిపై స్పందించి, తగినచర్య తీసుకోమని ప్రధానమంత్రిని ఆదేశించడంతో, దిగి వచ్చి, తన తప్పుకు క్షమాపణ కోరి, తప్పించుకొన్నాడు సల్మాన్ ఖుర్షీద్. అయితే ఆ వెంటనే మరొక కేంద్ర మంత్రి బేణిప్రసాద్ వర్మ మళ్లీ మైనార్టీల రిజర్వేషన్లపై వివాదాస్పద హామీ ప్రకటించాడు. తనను ఉరి వేసినా సరే తన మాట వెనక్కు తీసుకోనని ప్రకటించి, ఎన్నికల కమిషన్ పట్ల ధిక్కార స్వరాన్ని ప్రదర్శించాడు. ఆయన విషయంలో కూడా కఠినమైన నిర్ణయం తీసుకోవడానికి కమిషన్ సిద్ధపడడంతో చివరి నిముషంలో దిగివచ్చి క్షమాపణ చెప్పాడు.

జమీన్‌రైతు

ఈ పరిణామాలకు కొనసాగింపుగా కేంద్ర మంత్రివర్గంలో అత్యంత సీనియర్ అయిన ప్రణబ్ ముఖర్జీ, ఎన్నికల నియమావళి ఉల్లంఘన వివాదాల పరిష్కారాన్ని న్యాయస్థానాలకు అప్ప చెప్పే ప్రతిపాదన ఆలోచనలో వుందని సూచన ప్రాయంగా బయట పెట్టాడు. ఎన్నికల నియమాల ఉల్లంఘనపై చర్య ఎన్నికల కమిషన్ అధికారంలో సర్వోత్తమమైనది. దాన్ని హరించడం అంటే కమిషన్ స్వతంత్ర వ్యక్తిత్వాన్ని సంహరించడమే అవుతుంది. ఎన్నికల కమిషన్‌ను శక్తిహీనం చేయడం అంటే, ప్రజాస్వామిక వ్యవస్థ పీక నొక్కడంతో సమానం. ప్రజాస్వామ్య వ్యవస్థకు ఎన్నికల నిర్వహణ గుండెకాయ వంటిది. ఎన్నికల నిర్వహణలో తప్పిదాలు, తడబాట్లు జరిగితే మొత్తం ప్రజాస్వామ్య వ్యవస్థే కుప్పకూలి పోతుంది. అంతటి ప్రమాదకరమైన కుట్రకు కాంగ్రెస్ నేతలు ప్రాణం పోయడం ఘోరమైన నేరం. వారి మనసులలో నుంచి ఆ కుత్సితపు ఆలోచనలు తక్షణం తుడిచి పెట్టాలి. ఈ విషయంలో ఏ మాత్రం అజాగ్రత్త వహించినా, అలసత్వం ప్రదర్శించినా దేశానికి జరిగే నష్టం అంతా ఇంతా కాదు. యావత్ భారత ప్రజానీకం ఏకమై ముక్తకంఠంతో నిరసించవలసిన దురాలోచన ఇది.

## జనవాణి

### ఫుట్‌ఓవర్ బ్రిడ్జిలు అవసరం

నెల్లూరు నగరంలో ట్రాఫిక్ సమస్య రోజురోజుకు జటిలమవుతున్నది. నగరంలో వున్న ఒకే ఒక రోడ్డుపై వాహనాలు ఏ సమయంలో చూసినా బారులు తీరి నడుస్తున్నాయి. ఈ ట్రాఫిక్ అబందరలో జనం రోడ్డు దాటడం కష్టంగా వుంది. వృద్ధులు, మహిళలు, పిల్లలు రోడ్లు దాటడంలో వాహనాలు ఢీకొని గాయాల పాలవుతున్నారు. ప్రస్తుతానికి ఆర్టీసి, విఆర్‌సి, గాంధీబొమ్మ సెంటర్, ఆత్మకూరు బస్టాండ్ సెంటర్‌లలో జనం రోడ్డు దాటను ఫుట్ ఓవర్ బ్రిడ్జిల నిర్మాణానికి కార్పొరేషన్ తక్షణ చర్యలు తీసుకోమనవి.

*సిహెచ్.సురేష్‌బాబు* — నెల్లూరు

### బాలినేని సూచన పాటించండి!

వైఎస్ పాలనలో అవినీతి అక్రమాలు జరిగాయని, తాము మంత్రులుగా వున్నా తమకు తెలియకుండా అనేక నిర్ణయాలు తీసుకొన్నారని కిరణ్‌కుమార్‌రెడ్డి మంత్రివర్గంలోని మంత్రులు చెబుతున్నారు. ఇది దుర్మార్గం. మాజీ మంత్రి ఒంగోలు ఎమ్మెల్యే బాలినేని శ్రీనివాసులురెడ్డి సూచించినట్లు వైఎస్ క్యాబినెట్‌లో పనిచేసిన మంత్రులంతా తమపై సిబిఐ స్వచ్ఛంద విచారణ కోరి నిజాయితీని నిరూపించుకోవాలి.

*బిఆర్.శాలి* — కావలి

### పొగాకు ఉత్పత్తులు- హెచ్చరిక ప్రకటనలు!

కేంద్ర ప్రభుత్వాలు పొగాకు దాని ఉత్పత్తులను 18 సంవత్సరాలలోపు వారికి అనగా మైనర్లకు విక్రయించరాదని చట్టబద్ధమైన హెచ్చరిక జారీ చేసి వుంది. మనదేశంలో 90వేల మంది పొగాకు ఉత్పత్తులను వినియోగించడం మూలంగా మరణిస్తున్నారని తెలుస్తుంది. ఈ ప్రకటనలు జారీచేసి వున్నా నెల్లూరు నగరంతోపాటు జిల్లాలోని చిన్నాచితక బడ్డీ కొట్టులలో సైతం పొగాకు ఉత్పత్తులు అంటే చుట్టా, బీడి, సిగరెట్లను బహిరంగంగా విక్రయిస్తున్నారు. ఒక సర్వే ప్రకారం 14శాతం మంది మైనర్లు పొగాకు ఉత్పత్తులను వినియోగించడం మూలంగా పిన్న వయస్సులోనే క్యాన్సర్‌కు గురవుతున్నారు. భావితరం శ్రేయస్సు దృష్ట్యా పొగాకు ఉత్పత్తులు విక్రయించే షాపుల ముందు తెల్లబోర్డుపై నోటి క్యాన్సరును సూచించే బొమ్మతోపాటు, మైనర్లకు చుట్టా, బీడి, సిగరెట్లు అమ్మరని ప్రకటించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

*ఆలూరి ఆత్మానందం* — నెల్లూరు

### జమీన్‌రైతు అందంగా వుంది!

10తేది 'జమీన్‌రైతు' సంచిక ఫ్రంట్ లైన్ పేపరును తలపిస్తూ అందంగా వుంది. దీనికన్నా నిజమైన దోషులు వారే అంటూ వ్రాసిన సంపాదకీయం ఇంకా

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**27-2-1942**
**పేజీలు : 10 వెల: అణా**

### రైలు ప్రమాదం

25వ తేది నెల్లూరు నుండి విడవలూరుకు వడ్లకు మూడు బండ్లు పోతుండినవి. వాటిలో నెల్లూరు కత్తం కొండారెడ్డి బండి కొడవలూరు స్టేషన్ వద్ద గేటు తీసి ఉన్నందున ఆ దారిన పోతుండగా రాత్రి మూడు గంటలకు మద్రాసు నుండి ఉత్తరం పొయ్యే స్పెషల్ ట్రెయిన్ క్రిందబడి బండి, యెద్దులు నుజ్జు నుజ్జైపోయినవి. బండి నోగలో పండుకొని ఉన్న కూనం బలరామిరెడ్డి బండి నోగతో కూడా ఇంజన్ ముందుండే బంపర్‌లో ఇరుక్కొని సురక్షితంగా ఉన్నాడు. రైలు నిలిచినప్పుడు ఆ కుదుపుకు క్రిందబడగా పట్టిన నొప్పులు తప్ప మరే గాయాలు లేవు. దీన్నే దైవబలమంటారు.

### జీవ కారుణ్య సభ

తిర్యగంతవుల బంధువు, అహింసావాది అయిన కురుగంటి రాఘవరెడ్డి గారి కృషితో 24వ తేది జీవ కారుణ్య సభ పైడా సుబ్బరామయ్య గారి ఆధ్వర్యాన విజయవంతంగా జరిగింది. గోపూజ, ఉత్సవం, వికలాంగులకు బియ్యపు దానము, సభలో అమృతోపన్యాసాలు, రాత్రి హరికథ దివ్యంగా జరిగింది.

### ఉత్సవం

నరసింహకొండ వాస్తవ్యుడు, హిందూ దేవుడు నరసింహ స్వామి గారు 4వ తేది ఉదయం 7 గంటల నుండి నెల్లూరు మూలపేట, డైకస్‌రోడ్డు, బజారు, సంతపేట, ఆస్పత్రి రోడ్డుమీదుగా ఊరేగుతానని పట్టాభిరామిరెడ్డి ద్వారా అధికార్లకు అర్జీ పెట్టుకున్నాడు. బహుశా అధికార్లు ఉత్తర్వు ఇవ్వవచ్చు. ఆ దినం గలాటాలు లేకుండా చేయమని అల్లాను వేడుతున్నాము.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**23-2-1962**
**పేజీలు: 8 వెల: 0-20 న.పై**

### తొలినాటి పోలింగులోనే నక్షత్రం నేలరాలింది!

కావలి పార్లమెంటు నియోజకవర్గంలో 19వ తేది జరిగిన మూడు శాసనసభ స్థానాల పోలింగు వివరాలను పరిశీలిస్తే, నక్షత్రం నేలరాలినట్లే భావించవచ్చు. ఈ మూడు చోట్ల కాంగ్రెస్ అభ్యర్థి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారికి 20వేల ఓట్ల మెజారిటీ రాగలదనేది పరిశీలకుల అంచనా. ఇందులో ఒక్క కావలి నియోజకవర్గంలోనే 15వేలు రాగలదని నమ్మటకు అవకాశాలున్నాయంటున్నారు.

ఇక ఆత్మకూరులో జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి 5 – 7వేల మధ్య తేడాతో విజయం పొందగలడు. ఇచ్చట తమ ఓటమిని స్వతంత్ర పార్టీ వారే అంగీకరిస్తున్నారట. వెంకటగిరిలో గూడా కాంగ్రెస్ అభ్యర్థి అల్లం కృష్ణయ్య తప్పక గెలుపొందగలడని పోలింగు అనంతరం వచ్చిన వార్తలు తెల్పుతున్నవి. దర్శిలో పోటీ కాంగ్రెస్ – స్వతంత్ర పార్టీల మధ్య తీవ్రంగా ఉండినదని, కమ్యూనిస్టులు మూడవ స్థానానికి పోయారని, ఇచ్చట గెలుపు ఓటములు చెప్పడం కష్టమని మొదటి వార్త. కానీ పోలింగు ముందు రోజు అనూహితంగా వచ్చిన పరిణామం కాంగ్రెస్ అభ్యర్థి విజయానికి అవకాశాన్ని కల్పించిందని ఇంకొక వార్త. బుచ్చి శాసనసభ స్థానం విషయం గూడా అనిశ్చితంగా ఉంది.

### గోపాలరెడ్డి ఆరోగ్యం

మద్రాసు జనరల్ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న డాక్టరు గోపాలరెడ్డి గారికి పూర్తి స్వస్థత చేకూరినది. హాస్పిటల్ నుండి పోవచ్చునని డాక్టర్లు సలహా ఇచ్చారు. గోపాలరెడ్డి గారు మార్చి 1వ తేది నెల్లూరుకు వచ్చి నాలుగైదు రోజులు ఇచ్చటుండి తర్వాత ఢిల్లీకి పోగలరట. గోపాలరెడ్డి గారికి గుండె జబ్బు కాదని కాలేయం వ్యాధి అని నిర్ణయించారట. అది గూడా ఇప్పుడు పూర్తిగా బాగైనది.

# నెల్లూరు ముచ్చట్లు

ఐకుతాని

## కోవూరు ఉప ఎన్నిక 18న!

కోవూరు అసెంబ్లీ స్థానానికి మార్చి 18వ తేది ఉప ఎన్నిక జరుగుతుందని ఎన్నికల కమిషన్ ప్రకటించింది. ఫిబ్రవరి 22వ తేదీన మొదలైన నామినేషన్ల స్వీకరణ కార్యక్రమం 29వరకు కొనసాగుతుంది. మార్చి 1వ తేది నామినేషన్లను పరిశీలిస్తారు. 3వ తేది ఉపసంహరణకు గడువు. 21వ తేది ఓట్ల లెక్కింపు కార్యక్రమం నెల్లూరు పాలిటెక్నిక్ కాలేజీలో జరుగుతుంది.

## రిటర్నింగ్ అధికారిగా వీరభద్రయ్య!

కోవూరు ఎన్నికలకు జడ్పీ సిఇఓ వీరభద్రయ్య రిటర్నింగ్ అధికారిగా వ్యవహరిస్తారు. ఈయన కృష్ణాజిల్లా జడ్పీ సిఇఓగా పనిచేస్తూ నెల్లూరుకు బదలీ అయ్యారు. ఇక్కడ సిఇఓగా పనిచేస్తుండిన జయరామయ్య గత మూడేళ్లుగా జిల్లాలోనే పనిచేస్తుండడంతో ఎన్నికల నిబంధనావళి ప్రకారం ఆయన బదలీ అనివార్యమయ్యింది. వీరభద్రయ్య నెల్లూరుకు పాతకాపే. ఆయన గతంలో జడ్పీ డిప్యూటీ సిఇఓగా పనిచేశారు.

## జగన్ ప్రచారం

కోవూరు మినహా రాష్ట్రంలో ఉప ఎన్నికలు జరుగుతున్న ఏ అసెంబ్లీ స్థానం నుంచి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పోటీ చేయడం లేదు. దీనివల్ల కోవూరులో ఎన్నికల ప్రచారం చేయను ఆ పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి రెండు విడతలుగా కోవూరు రానున్నారు. మార్చి 2,3,4 తేదీలతోపాటు 14, 15 తేదీల్లోనూ ఆయన కోవూరులో పర్యటిస్తారు.

## ఎన్నికల కోడ్!

కోవూరులోనే ఉప ఎన్నిక జరుగుతున్నా ఎలక్షన్ కోడ్ మాత్రం జిల్లా అంతటా అమలులో ఉంటుందని కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ప్రకటించారు. ఏ పథకాల ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలు ఎన్నికల ఫలితాలు ప్రకటించేవరకు ఉండవన్నారు. అన్ని ప్రభుత్వ శాఖల అధికారులు ఎన్నికల కోడ్‌ను మనసులో పెట్టుకొని మసలుకోవాలన్నారు.

## సిట్‌కు శ్రీనివాసరెడ్డి నాయకత్వం!

వివిధ ప్రభుత్వ శాఖల అధికారులకు మద్యం సిండికేట్లతో గల సంబంధ బాంధవ్యాలను విచారించే ప్రత్యేక బృందం సిట్‌కు నాయకుడిగా ప్రస్తుత ఎసిబి అదనపు డైరక్టర్, నెల్లూరు పాత ఎస్పీ కొత్తకోట శ్రీనివాసరెడ్డిని ప్రభుత్వం నియమించింది. ఈయనతోపాటు ఈ బృందంలో మరో 12 మంది అధికారులుంటారు. ఏ పోస్టులో పనిచేసినా శ్రీనివాసరెడ్డి నిక్కచ్చిగా వ్యవహరిస్తారని పేరు. నెల్లూరు సిండికేట్ల వ్యవహారంపై ఆయనకు పూర్తి అవగాహన ఉండడంతో అక్రమార్కుల గుండెల్లో రైళ్లు పరుగెడుతున్నాయి.

## పొగ మంచు

వాతావరణంలో మళ్లీ మార్పులు మొదలయ్యాయి. ఫిబ్రవరి నెల మూడవ వారంలోనే పగటి ఉష్ణోగ్రతలలో మార్పులు చోటు చేసుకొంటున్నాయి. 18, 19, 20 తేదీల్లో నెల్లూరును దట్టమైన పొగమంచు కప్పేసింది. శివరాత్రి ముందు ఇటువంటి మంచుదుప్పటి మామూలేనని వయోవృద్ధులు వ్యాఖ్యానిస్తున్నారు.

## కరివేపాకు కట్ట ఐదు రూపాయలు!

కూరలోని తిరగమాతలో ఖచ్చితంగా కనపడే కరివేపాకు కూడా కనపడని కాలమొచ్చింది. రూపాయికి దొరికే కరివేపాకు కట్ట ప్రస్తుతం ఐదు రూపాయలయ్యింది. కొత్తిమీర, పుదీనా పెద్ద కట్టలు ఐదు రూపాయలకే దొరుకుతుండగా కరివేపాకు చిన్నకట్ట ఐదు రూపాయలమ్ముతుండడంతో మహిళలు కలికాలమంటూ ముక్కున వేలేసుకొంటున్నారు.

## శివరాత్రికి స్పెషల్ విద్యుత్ కోత!

పండగ పూట విద్యుత్ కోత లేకుండా చూడాల్సిన విద్యుత్ శాఖాధికారులు శివరాత్రిని పురస్కరించుకొని స్పెషల్ విద్యుత్ కోత విధించారు. 20, 21 తేదీల్లో ఉదయం 9 గంటలకు తీసిన విద్యుత్‌ను 1.30 ప్రాంతం వరకు ఇవ్వలేదు. ఇదేమిటని ప్రశ్నిస్తే కోటప్పకొండలో ప్రభలు వెళ్తున్నాయన్న సమాధానం వచ్చింది. అక్కడ ప్రభలు వెళ్లే దానికి నెల్లూరులో విద్యుత్ ఆపడానికి ఏమి సంబంధం నందకుమార్ గారు! అనవసర కోతలతో జనం చేత తిట్లు తినకండి సార్.



## జనాభా'పురి'

నెల్లూరు నగరం రాష్ట్రంలో జనంతో కిటకిటలాడే నగరాల్లో ఆరవ స్థానానికి చేరుకొంది. నగర జనాభా 5,64,148 మందికి చేరుకొంది. నెల్లూరు కన్నా ముందు స్థానాల్లో హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ, వరంగల్, గుంటూరు నగరాలున్నాయి. రాజమండ్రి, తిరుపతి నగరాలు జనాభాలో నెల్లూరు కన్నా వెనుకబడ్డాయి.



మాజీ ముఖ్యమంత్రి, రాజ్యసభ సభ్యుడు నేదురుమల్లి జనార్దనరెడ్డి 77వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని హైదరాబాద్‌లో ఆయనకు జన్మదిన శుభాకాంక్షలు తెలియజేస్తున్న బాలసుధాకర్, కోటీశ్వరరెడ్డి తదితరులు.

## డిఎస్పీగా ఎంపికైన ఫోర్త్‌టౌన్ ఎస్ఐ!

నెల్లూరు ఫోర్త్‌టౌన్ ఎస్ఐ నిడికొండ వెంకట రామాంజనేయులు డిఎస్పీగా ఎంపికయ్యారు. ఇటీవల ప్రకటించిన ఎపిపిఎస్సీ ఫలితాల్లో ఆయనకు 531 మార్కులొచ్చాయి. ఈయన స్వస్థలం గుంటూరు జిల్లా నగరేకల్. 2008లో ఎస్ఐగా ఎంపికైన ఆయన జిల్లాలోని సంగం, అల్లూరు, చేజర్ల పోలీస్ స్టేషన్లలో పనిచేసి నెల్లూరుకు వచ్చారు. మూడు నెలలపాటు ఈ స్టేషన్‌లో కుదురుగా పనిచేయక ముందే డిఎస్పీగా ఎంపిక కాగలిగారు.

## ప్రశాంతంగా పరీక్షలు

విఆర్ఓ, విఆర్ఏ ఎంపికకు గాను 19వ తేది నెల్లూరు నగరంలోని 71 కేంద్రాల్లో జరిగిన వ్రాత పరీక్ష ప్రశాంతంగా జరిగింది. విఆర్ఓ పోస్టులకు 17,854 మంది దరఖాస్తు చేసి 13,175 మంది పరీక్ష వ్రాశారు. విఆర్ఏ పోస్టులకు 6,739 మంది దరఖాస్తు చేసి 4,831 మంది పరీక్ష వ్రాసినట్లు ఈ పరీక్షలను పర్యవేక్షించిన అదనపు జెసి లక్ష్మీకాంతం చెప్పారు.

## నగరానికి 100 క్యూసెక్కులనీరు!

19వ తేది జరిగిన జిల్లా సాగునీటి సలహా బోర్డు సమావేశంలో నెల్లూరు నగరానికి 100 క్యూసెక్కుల నీటిని సోమశిల ప్రాజెక్ట్ నుంచి వేసవికాలంలో విడుదల చేయను అధికారులు ఒప్పుకొన్నారు. ఈ సమావేశానికి ఎన్నికల కోడ్ మూలంగా నేతలు హాజరు కావడానికి అవకాశం లేకుండా పోవడంతో కార్పొరేషన్ కమిషనర్ ఆంజనేయులు చురుకుగా వ్యవహరించి ఈ నీటిని సాధించారు. పెన్నా ఆనకట్ట నిర్మాణ పనులు జరుగుతున్న దృష్ట్యా ఈ నీటిని బుజ్జమ్మ రేవు వద్ద ఇసుక కట్టవేసి జాగ్రత్త చేసుకోవాలి.

కొరవ 14వ పేజీలో

# నిద్రపోతే పరీక్ష బాగా వ్రాస్తారు!

● విద్యార్థులకు మానసిక వైద్య నిపుణుడు డాక్టర్ శ్రీనివాస తేజ సలహా

పరీక్షలకు హాజరయ్యే విద్యార్థుల విజయ రహస్యం అంతా వారి నిద్రలోనే దాగి ఉందని చెప్తున్నారు ప్రముఖ న్యూరో సైకియాట్రిస్ట్ డాక్టర్ శ్రీనివాసతేజ. వివిధ పరీక్షలకు హాజరయ్యే విద్యార్థులను దృష్టిలో వుంచుకొని పలు సూచనలు, సలహాలను అందజేశారు. అవి వారి మాటల్లోనే.


డాక్టర్ శ్రీనివాస తేజ

ఒక ఏడాది కష్టపడి చదివిన చదువును రెండున్నర గంటల పరీక్షల్లో, పదిహేను నిముషాల పేపర్ దిద్దే అధ్యాపకుల సైకాలజీపై ఆధారపడి ఉందన్న విషయాన్ని ముందు విద్యార్థులు గుర్తించాలి. దానికి తగినట్లు పరీక్ష వ్రాయడంలోనే వారికి వచ్చే మార్కులు ఆధారపడి ఉన్నాయి. మొదటగా ప్రశ్నాపత్రం చేతికి తీసుకోగానే ముందుగా వచ్చిన సమాధానాన్ని వ్రాయడం ప్రధానం. వ్రాయదల్చుకొన్న అంశాన్ని నీట్‌గా అర్ధమయ్యేలా చక్కని అక్షరాలతో, సైడ్ హెడ్డింగ్‌లు పెట్టి వ్రాయాలి. అలా చేయడం వల్ల పేపర్ దిద్దేవారికి ఇంప్రెషన్ కల్గి అధిక మార్కులు వచ్చేందుకు అవకాశం ఉంది. చెప్పాల్సిన దానిని సూటిగా సోది లేకుండా రాయడం అవసరం. రంగు రంగుల స్కెచ్ పెన్‌లతో ముఖ్యమైన వాటికి అండర్‌లైన్ చేసినా మంచిదే. ముఖ్యంగా విద్యార్థులందరూ గుర్తుంచుకోవలసింది తగినంత నిద్ర పోవడం. ఎంత చదివినా అవన్నీ గుర్తుండాలంటే చక్కని నిద్ర అవసరం. కచ్చితంగా 9 గంటల నిద్ర పోవాలి. అప్పుడే మైండ్ ప్రశాంతంగా ఉండి చదివిన వాటిని బాగా వ్రాయగల్గుతారు.

ఆహార విషయమై విద్యార్థులకు చాలా అపోహలున్నాయి. పరీక్షలకు వెళ్లే ముందు ప్రొటీన్ ఫుడ్ తీసుకోవాలి. మిగతా సమయంలో కార్బోహైడ్రేడ్స్ ఉన్న ఆహారం తినాలి. అప్పుడే చురుకుగా మెదడు పనిచేసి చక్కగా వ్రాయగల్గుతారు. పరీక్ష హాలులో చదివినవి గుర్తురాని సందర్భాలలో కొద్దిసేపు పెన్ ప్రక్కన పెట్టి గాఢమైన శ్వాస తీసుకొని, రిలాక్స్ అయి తర్వాత వ్రాస్తే మంచి ఫలితాలు సాధించే అవకాశం ఉంది.

● ఆనం బ్రదర్స్ కనుసన్నల్లో

# లిక్కర్ వ్యాపారం!

సమావేశంలో మాట్లాడుతున్న కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి.

ఆనం సోదరుల కనుసన్నల్లో నెల్లూరులో లిక్కర్ వ్యాపారం జరుగుతోందని తెలుగుదేశం పార్టీ విమర్శించింది. పార్టీ కార్యాలయంలో టిడిపి నేతలు కిలారి వెంకటస్వామినాయుడు, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి సంయుక్తంగా విలేకరుల సమావేశం నిర్వహించారు. ఆనం సోదరులకు ఇటీవల లిక్కర్ వ్యాపారులు శుభాకాంక్షలు చెబుతూ ప్రకటనలు ఇచ్చారని దీనినిబట్టే వీరి మధ్య ఉండే సంబంధాలు అర్థమవుతాయన్నారు. వివేకానందరెడ్డికి నెల నెలా లిక్కర్ వ్యాపారుల వద్ద నుంచి మామూళ్ల రూపంలో లక్షల రూపాయలు అందుతున్నాయని ఆరోపించారు. అధికార పార్టీ నాయకులు, లిక్కర్ డాన్‌లను వదిలిపెట్టి కేవలం ఒకరిద్దరిపై ఎసిబి దాడులు చేయడం వెనుక ఆంతర్యం ఏమిటని వారు ప్రశ్నించారు. లిక్కర్ సిండికేట్ల నుంచి ఎవరెవరికి ఎంతెంత అందుతున్నాయో ఎసిబి అధికారులు బహిర్గతం చేయాలని డిమాండ్ చేశారు. తెలుగుదేశం పార్టీ అధికారంలో ఉన్నప్పుడే నగరంలో అభివృద్ధి జరిగిందని ప్రస్తుతం కాంగ్రెస్ పాలనలో ఉత్త మాటలు తప్ప అభివృద్ధి అనేది జరగలేదని విమర్శించారు.




జిల్లాలోని నాలుగు మునిసిపాల్టీలలో 200 రూపాయలకే కొళాయి కనెక్షన్ ఇవ్వనున్నారు. దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హయాంలో తెల్ల రేషన్ కార్డు కలిగి ఉన్న వారికి 1200 రూపాయలు మునిసిపాల్టీ పరిధిలో కొళాయి కనెక్షన్ ఇవ్వాలని నిర్ణయించింది ప్రభుత్వం. దీంతో అధిక సంఖ్యలో దరఖాస్తులు అందాయి. నిబంధనలు కఠినంగా ఉండడంతో అధికారులు కొద్ది మందికి మాత్రమే అందించగలిగారు. మిగిలిన దరఖాస్తులు పెండింగ్‌లో ఉండిపోయాయి. తాజాగా రెండు వందల రూపాయలకే కొళాయి కనెక్షన్ ఇస్తారని ప్రకటన రావడంతో వేల సంఖ్యలో దరఖాస్తులు వస్తున్నాయి. వీధి కొళాయిలు సక్రమంగా పనిచేయకపోవడం కారణంగా పేద ప్రజలు తాగునీరందక ఇబ్బందులు పడేవారు. నెల్లూరు కార్పొరేషన్ పరిధిలో ఎక్కువ దరఖాస్తులున్నాయి. కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాలిటీలు ద్వితీయ స్థానంలో ఉన్నాయి. అన్ని ప్రాంతాలకు పైపులైన్ ఏర్పాటుచేసి కొళాయి కనెక్షన్లు అందించేందుకు అధికారులు ఏర్పాట్లు చేస్తున్నారు.

# ఉపాధిహామీ కేసులకు ప్రత్యేక కోర్టు!

జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకంలో అక్రమాలకు పాల్పడిన వారిపై నమోదైన కేసులను విచారించేందుకు తిరుపతిలో ప్రత్యేక కోర్టును ఏర్పాటు చేసింది ప్రభుత్వం. నెల్లూరు, చిత్తూరు జిల్లాలకు సంబంధించిన కేసులు ఈ ప్రత్యేక కోర్టులో విచారిస్తారు. ప్రస్తుతం జిల్లాలోని 46 మండలాలకు గాను 38 మండలాల్లో ఉపాధి హామీ పథకం పనులు జరుగుతున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో జరిగిన పనులు, కూలీలకు చెల్లించే నగదు విషయంలో ఇప్పటికే దాదాపు కోటి రూపాయలకు పైగా దుర్వినియోగం జరిగినట్లు అధికారులు నిర్ధారించారు. ఈ పథకం కింద ఖర్చు చేయబడిన నిధులపై ప్రతినెల సామాజిక తనిఖీలు నిర్వహించేందుకు సంబంధిత అధికారులు శ్రీకారం చుట్టారు. రాజకీయ ఒత్తిళ్ల కారణంగా అక్రమార్కులపై పోలీసు కేసులు నమోదు కాబడడం లేదు. ఇక నుంచి క్షేత్రస్థాయిలో అక్రమాలకు పాల్పడిన వారిపై కేసు నమోదు చేయాలని ప్రభుత్వం నుంచి సంబంధిత శాఖ అధికారులకు ఇటీవల ఉత్తర్వులు జారీ అయ్యాయి. దుర్వినియోగం చేసిన నిధులను రికవరీ చేయడంతోపాటు దీనికి బాధ్యులైన వారికి శిక్ష విధించే అవకాశం ఉంటుందని అధికారులు చెబుతున్నారు. గతంలో మాదిరి కాకుండా నిబంధనల ప్రకారం ఈ పథకంలో పనిచేసే సిబ్బంది, అధికారులు జాగ్రత్తగా వ్యవహరించాల్సిన అవసరం ఉంది.

# 28న సార్వత్రిక సమ్మె

ఏకమైన అన్ని కార్మిక సంఘాలు

ప్రభుత్వ వ్యతిరేక విధానాలను నిరసిస్తూ ఈ నెల 28న జరుగనున్న సార్వత్రిక సమ్మెను జయప్రదం చేయాలని కార్మిక సంఘాల నేతలు పిలుపునిచ్చారు. నగరంలోని పురమందిరంలో ఇటీవల కార్మిక సంఘాల ఆధ్వర్యంలో బహిరంగ సభ జరిగింది. ఈ సభలో పాల్గొన్న పలువురు నేతలు మాట్లాడుతూ వివిధ రంగాలలో పని చేస్తున్న కార్మికుల పట్ల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కనీస వేతనాలను అమలు చేయకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయని విమర్శించారు. కేంద్ర ప్రభుత్వం కార్మిక చట్టాలను మరింత మెరుగుపరచి సమర్థవంతంగా నిర్వహించేందుకు అధికారులకు స్పష్టమైన ఆదేశాలు జారీ చేయాలని వారు డిమాండ్ చేశారు. ప్రభుత్వ రంగ సంస్థల్లో పనిచేస్తున్న కార్మికులందరికీ కనీస వేతనంగా పదివేల రూపాయలు నిర్ణయించే విధంగా చట్టం చేయాలని కోరారు. అలాగే ప్రభుత్వ సంస్థల్లో ప్రైవేటు పెట్టుబడులను నియంత్రించి ప్రైవేటు సంస్థల అమ్మకాలను నిషేధించాలన్నారు. ఈ కార్యక్రమంలో ఏఐటియూసి, సిఐటియూ, బిఎంఎస్, టిఎన్‌టియూసి నాయకులు అజయ్‌కుమార్, రవీంద్రనాథ్, మోహన్‌రావు, రమణ, హనుమంతరావు తదితరులు పాల్గొన్నారు.


నెల్లూరీయుడు చెన్నూరు వెంకటేశ్వర్‌రెడ్డి కుమారుడు రాకేష్, సౌమ్యల వివాహం 12 తేది హైదరాబాద్‌లోని నోవాటెల్ హోటల్‌లో జరిగింది.

# అక్రమాలకు సాఫ్ట్‌వేర్‌తో కళ్లెం!

పంచాయితీల్లో సరికొత్త ప్రయోగం

జిల్లాలోని అన్ని గ్రామ పంచాయితీలలో ఇప్పటివరకు జరుగుతున్న పలు అక్రమాలకు త్వరలో కళ్లెం పడనుంది. ఇందుకోసం రాష్ట్ర ప్రభుత్వం ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన కంప్యూటర్లను పంపిణీ చేయాలని నిర్ణయించింది. జిల్లాలో 961 గ్రామ పంచాయితీలు ఉండగా వీటిలో 42 మేజర్ పంచాయితీలు ఉన్నాయి. గ్రామాల అభివృద్ధికి ప్రతి సంవత్సరం ప్రభుత్వం వివిధ పథకాల పేరుతో నేరుగా నిధులను కేటాయిస్తుంటుంది. సర్పంచ్, కార్యదర్శులు కొన్ని సందర్భాల్లో కుమ్మక్కై అభివృద్ధి పనులు పూర్తి చేయకుండానే నిధులను ప్రక్కదారి పట్టించేవారు. జిల్లావ్యాప్తంగా పలు గ్రామ పంచాయితీలలో నిధుల గోల్మాల్ జరిగినట్లు ఫిర్యాదులు ఉన్నాయి. నిధుల మంజూరు దగ్గర నుంచి ఖజానా నుంచి నగదు డ్రాచేసే వరకు ప్రతి దశలో అక్రమాలను నియంత్రించేందుకు మండల పరిషత్ కార్యాలయాల్లో కంప్యూటర్లను అమర్చుతారు. నూతన సాఫ్ట్‌వేర్ విధానంపై జిల్లా పరిషత్ సిఇఓ జయరామయ్య కసరత్తు ప్రారంభించారు. ఖజానా కార్యాలయం, బ్యాంకు నుంచి నగదు డ్రాచేసిన వెంటనే పూర్తి వివరాలు ఎంపిడిఓ కార్యాలయంలో అమర్చిన కంప్యూటర్లలోకి చేరిపోతాయి. డ్రాచేసిన నగదును ఏ పనులకోసం ఖర్చు చేశారన్న నివేదికలు అందిన తర్వాత ఇందులో నమోదు చేస్తారు. అన్ని మండల పరిషత్ కార్యాలయాల్లో కంప్యూటర్లు ఏర్పాటు చేసిన తర్వాత వచ్చే ఆర్థిక సంవత్సరం నుంచి పంచాయితీలలో ఈ సరికొత్త ప్రయోగం అమలులోకి తీసుకురానున్నారు.



# అంకెల గారడీ బడ్జెట్

**గూడూరు ఎమ్మెల్యే విమర్శ**

రాష్ట్ర ఆర్థికమంత్రి రామనారాయణరెడ్డి ప్రవేశపెట్టిన బడ్జెట్ ప్రజావ్యతిరేక బడ్జెట్ అని ఇందులో అంకెల గారడీ తప్ప మరేమీ లేదని గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ విమర్శించారు. ఇటీవల కోటకు వచ్చిన ఆయన విలేకర్లతో మాట్లాడారు. ప్రజలను పట్టించుకోని ప్రభుత్వం కాంగ్రెస్ ప్రభుత్వమన్నారు. రాష్ట్రంలో పలువురు మంత్రులు, శాసనసభ్యులకు మద్యం సిండికేట్లతో సంబంధాలు వున్నట్లు తెలిసినా ప్రభుత్వం వారిపై చర్యలు తీసుకోకపోవడం సిగ్గు చేటన్నారు. మద్యం సిండికేట్లపై ఎసిబి అధికారులు దాడులు నిర్వహించడం అభినందనీయమని, అయితే కొంతమందిని మాత్రమే అరెస్టు చేసి తామేదో సాధించినట్లు చెప్పుకోవడం విడ్డూరంగా వుందన్నారు. తక్షణం మద్యం సిండికేట్లతో కుమ్మక్కై అవినీతికి పాల్పడిన మంత్రులు, ఎమ్మెల్యేలను బర్తరఫ్ చేయాలని డిమాండ్ చేశారు. ఇటీవల టిడిపి అధినేత చంద్రబాబునాయుడిపై వైఎస్ విజయమ్మ దాఖలు చేసిన పిటిషన్‌ను న్యాయస్థానం కొట్టివేయడం చంద్రబాబునాయుడి నిజాయితీకి నిదర్శనం అన్నారు.

# ప్రసన్న విజయం తథ్యం

**● కోటంరెడ్డి శ్రీధర్ జోస్యం**



కోవూరు నియోజకవర్గంలో జరిగే ఉప ఎన్నికల్లో నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విజయం సాధించడం తథ్యమని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నేత కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి జోస్యం చెప్పారు. ఢిల్లీ రాజకీయ పిశాచాలకు, ప్రజల గుండెల్లో ఆరాధ్యదైవంగా కొలువు దీరిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఆశయాలకు ప్రతిరూపంగా ఏర్పడ్డ పార్టీకి మధ్య జరుగుతున్న ఎన్నికలని అభివర్ణించారు. నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో 93 రోజులపాటు కొనసాగిన పాదయాత్ర కార్యక్రమాన్ని తాత్కాలికంగా వాయిదా వేసిన సందర్భంగా ఆయన విలేకరులతో మాట్లాడారు. కోవూరు ఎన్నికలు స్థానిక ప్రజల ఆత్మగౌరవానికి ప్రతీక అన్నారు. కాంగ్రెస్, తెలుగుదేశంపార్టీ ఓటర్లను డబ్బు సంచులతో కొనుగోలు చేయాలని చూస్తున్నాయని, అలాంటి వారికి నియోజకవర్గ ప్రజలు తగిన బుద్ధి చెప్తారన్నారు. ఎవరు ఎన్ని కుయుక్తులు, కుతంత్రాలు పన్నినా తమపార్టీ అభ్యర్థి ప్రసన్నకుమార్‌రెడ్డి విజయం సాధిస్తాడన్న ధీమా వ్యక్తం చేశారు. ఎన్నికలను దృష్టిలో వుంచుకొని వాయిదా వేసిన పాదయాత్రను తిరిగి ఏప్రెల్ 1 నుంచి ప్రారంభిస్తామని ప్రకటించారు. ఈ సమావేశంలో మాజీ కౌన్సిలర్ కెవి.రాఘవరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

**● గూడూరులో**

# బాలుడి మృతిపై గొడవ!

వైద్య చికిత్స అందించడంలో డాక్టర్ నిర్లక్ష్యంగా వ్యవహరించినందువల్లే బాలుడు మృతి చెందాడంటూ వారి బంధువులు గొడవకు దిగిన ఘటన గూడూరులో చోటు చేసుకొంది. స్థానికంగా ఆస్పత్రి నిర్వహిస్తున్న డాక్టర్ గంగాధర్‌రెడ్డి వద్దకు చికిత్స కోసం వినోద్‌కుమార్ అనే బాలుడు వచ్చాడట. మందులు వాడినా ఆ పిల్లవానికి జ్వరం తగ్గకపోవడం, డాక్టర్ అందుబాటులో లేకపోవడంతో నెల్లూరుకు తీసుకువెళ్లగా అక్కడి వైద్యులు డెంగ్యూగా నిర్ధారించి చెన్నైకు తీసుకెళ్లమన్నారట. మార్గమధ్యంలో వుండగా బాలుడు మృతి చెందడంతో తల్లిదండ్రులు, బంధువులు గూడూరు డాక్టర్ కారణంగానే ఇలా జరిగిందని, డెంగ్యూ జ్వరాన్ని ముందరే గుర్తించి చికిత్స చేసి వుంటే బ్రతికి వుండేవాడని రోధిస్తూ ఆస్పత్రి వద్దకు చేరుకొని ఆందోళనకు దిగారు. డాక్టర్ గంగాధర్ మాత్రం ఇందులో తన తప్పేమీ లేదంటుండగా అక్కడికి వచ్చిన వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు ఎల్లసిరి గోపాలరెడ్డి బాధితులతోపాటు మీడియాపై విరుచుకపడ్డారు.

# మర్రిపాడు ఎస్‌ఐ దాదాగిరి!

**◆ పొగాకు రైతులను చితకబాదాడు**

మర్రిపాడు ఎస్‌ఐ రవినాయక్ వ్యవహారశైలి వివాదాస్పదమౌతోంది. యువకుడైన ఆయన బాధ్యతలు చేపట్టిన కొత్తల్లో కరకుగా డ్యూటీ చేయడంతో మండల ప్రజలు ఎంతో సంతోషించారు. అడ్డు ఆపు లేకుండా తిరుగుతున్న వాహనాలకు కళ్లెం వేయడం, ఆటో వారిని అదుపులో పెట్టడం లాంటి చర్యలు ప్రజల మన్ననలు చూరగొన్నాయి. అయితే రానురాను ఎస్‌ఐ తలబిరుసుగా వ్యవహరిస్తుండడం విమర్శలపాలవుతోంది. ఇటీవల డిసిపల్లి బస్టాండ్ సెంటర్‌లో స్థానికంగా వ్యాపారం చేసుకొనే వారిపట్ల ఎస్‌ఐ అనుచితంగా ప్రవర్తించడం చర్చనీయాంశమైంది. ఆ సెంటర్‌కు చేరుకున్న ఎస్‌ఐ రవినాయక్ వచ్చీరాగానే వ్యాపారులపై పడి చితకబాదాడు. ఎందుకు కొడుతున్నాడో తెలియక చిరు వ్యాపారులు భయభ్రాంతులకు గురయ్యారు. గొడ్డును బాదినట్లు బాదడంతో గాయాలపాలయ్యారు. అంతేకాకుండా సాయంత్రం కాగానే దుకాణాలు మూసేయాలని బెదరిస్తున్నాడని వ్యాపారులు వాపోతున్నారు. కొన్ని రోజుల క్రిందట మద్యం సేవించిన ముగ్గురు యువకులు గొడవ పడగా ఒకరు మృతి చెందాడు. దీనిని దృష్టిలో వుంచుకొని ఎస్‌ఐ అంగళ్లు పెందలాడే మూసేయాలనడాన్ని నిరసిస్తున్నారు. మరోవైపు డిసిపల్లి పొగాకు కేంద్రంలో వేలం ప్రారంభమవుతున్న తరుణంలో వ్యాపారుల తాకిడి అధికంగా వుంటుంది. పొద్దుపోయేంత వరకు పొగాకు రైతులు, వ్యాపారులతో రద్దీగా వుంటుంది. అలాంటి పరిస్థితుల్లో ఎస్‌ఐ అంగళ్లు మూయిస్తుండడం, లాఠీకి పని చెప్పడంపై ఉన్నతాధికారుల దృష్టికి తీసుకెళ్లనున్నారు.

**➪ నేతలకేం కాదు...**

# అధికారులకే నష్టం!

**కావలిలో కలెక్టర్ సంచలన వ్యాఖ్యలు**

అధికారులు రాజకీయ ఒత్తిళ్లకు లొంగి పని చేయొద్దు, ఏదైనా తప్పు జరిగితే వారు క్షేమంగానే వుంటారు జైలుకు పోయేది మీరేనంటూ జిల్లా కలెక్టర్ శ్రీధర్ అధికారులకు హితబోధ చేశారు. కలెక్టర్ చేసిన ఈ వ్యాఖ్యలు సంచలనం కల్గించాయి. గనులు, ఎమ్మార్ సంస్థలపై సిబిఐ అధికారులు పలువురు ఐఎఎస్ అధికారులను జైలుకు పంపడాన్ని దృష్టిలో పెట్టుకొని ఆయన ఈమాటలన్నారు. కావలిలో ఎంపిడిఓ కార్యాలయంలో వివిధ శాఖల అధికారులతో సమీక్ష నిర్వహించారు. ఏం చేసినా మంత్రులకు, రాజకీయనేతలకు ఏమీ కాదన్న విషయాన్ని గ్రహించి ఒళ్లు దగ్గర పెట్టుకొని పని చేయాలని సూచించారు. రాజీవ్ విద్యామిషన్ ద్వారా అమలవుతున్న పనుల్లో రాజకీయ ఒత్తిళ్లు వుంటున్నాయని అధికారులు కలెక్టర్ దృష్టికి తెచ్చిన సందర్భంలో ఆయన పైమాటలన్నారు. సక్రమంగా పని చేయని రాజీవ్ విద్యామిషన్ ఎఇ రాఘవేంద్రను రిలీవ్ చేయాలని ఆదేశించారు. పశుక్రాంతి పథకాల అమలుపై సమీక్షించిన కలెక్టర్ రుణాలను సక్రమంగా అందజేయాలన్నారు. గ్రామాల్లో తాగునీటి ఎద్దడి తలెత్తకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలని సూచించారు. అనంతరం ఆయన సాంఘిక సంక్షేమ వసతి గృహాని పరిశీలించి విద్యార్థులతో ముచ్చటించారు. ప్రభుత్వం అమల్లోకి తెచ్చిన ప్రజ్ఞ పథకాన్ని సద్వినియోగం చేసుకోవాలని కోరారు. అనంతరం కంప్యూటర్లను స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావుతో కలసి ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో డ్వామా పిడి యుగంధర్, డిఆర్‌డిఏ పిడి వెంకటసుబ్బయ్య, జడ్పీ సిఇఓ జయరామయ్య ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# సరికొత్త పరిజ్ఞానంతో యాష్‌పాండ్!

నేలటూరులో నిర్మితమవుతున్న 1600వాట్ల ఎపిజెన్‌కో థర్మల్ విద్యుత్ కేంద్రానికి అవసరమైన యాష్ పాండ్‌ను సాంకేతిక పరిజ్ఞానంతో ఏర్పాటు చేస్తామని ప్రాజెక్టు ఎండి విజయానంద్ తెలిపారు. జెన్‌కో ప్రాజెక్టు పనులను పరిశీలించేందుకు నేలటూరు వచ్చిన ఆయన మాట్లాడుతూ యాష్‌పాండ్ నిర్మాణంపైన ఐదు గ్రామాల ప్రజలతో మాట్లాడతామన్నారు. వీరు దీనిని వ్యతిరేకిస్తున్న విషయమై విలేకరులు ప్రశ్నించగా ఆ విషయం తన దృష్టికి రాలేదన్న ఆయన అలాంటి సమస్యలేవి లేనట్లున్నాయని సమాధానమిచ్చారు. గ్రామాలలో కమిటీలు ఏర్పాటు చేసి చర్చిస్తామన్నారు. దీనికి సంబంధించి ఎలాంటి భూసేకరణ జరపలేదన్నారు. అలాగే మరో ప్రశ్నకు సమాధానమిస్తూ ప్రస్తుత సామర్థ్యానికి అదనంగా మరో 500 మెగావాట్లు ఉత్పత్తిని పెంచుకొనేందుకు కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు అనుమతినిచ్చాయన్నారు. అదనపు విద్యుత్ ఉత్పత్తికి 5,500 కోట్లు అవసరమని ప్రాథమికంగా నిర్ధారించాయన్నారు. ఎపిజెన్‌కోలో 2013 నాటికి విద్యుత్ ఉత్పత్తి ప్రారంభం అవుతుందన్నారు. ఈ సందర్భంగా ఆయన ప్రాజెక్టు ఆవరణంలో వివిధ విభాగాలను పరిశీలించడంతోపాటు మొక్కలు నాటారు. ఈ కార్యక్రమంలో ప్రాజెక్టు సిఇ శ్రీహరి, ఎస్ఇ నారాయణమూర్తి, ఎఇలు చాన్ భాషా, భక్తవత్సలరెడ్డి, ప్రాజెక్టు డైరెక్టర్లు వివేకానంద, రత్నం బాబు, పాండురంగారావు, కోటేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

# పోటాపోటీగా జర్నలిస్టుల ఎన్నికలు!

ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్టుల జిల్లా కార్యవర్గాన్ని ఎన్నుకొనేందుకు జడ్పీ కార్యాలయంలో 19వ తేది జరిగిన ఎన్నికలు జనరల్ ఎన్నికలను తలపింపజేశాయి. పోటాపోటీగా ఇరువర్గాల మోహరింపు. ఎన్నికల నిర్వహణకు నెల్లూరొచ్చిన రాష్ట్ర నాయకత్వం పాతకాపుల వైపు నిలబడ్డా జర్నలిస్టులు వాళ్ల దుమ్ముదులిపేశారు. అధ్యక్షునిగా భాస్కర్‌రెడ్డి(జీటీవి), కార్యదర్శిగా చంద్రశేఖర్(వార్త), తమ ప్రత్యర్థులు వి.వెంకటేశ్వర్లు, వి.ఎన్.శేషాచలపతిని హోరాహోరీ పోరులో ఓడించారు. చాలామంది సభ్యత్వం కట్టినా వాళ్లకు ఓటు లేకుండా చేసింది పాత కార్యవర్గం. ఈ ఎన్నికల్లో ఎట్లాగైనా గెలవడానికి నానాపాట్లు పడింది. ఎపియూడబ్ల్యుజె నూతన సారథులు జిల్లా యూనియన్‌ను సక్రమ మార్గాన నడపాల్సి ఉంది.



మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి 77వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని హైదరాబాద్‌లో ఆయనకు పుష్పగుచ్ఛమిచ్చి అభినందనలు తెలియజేస్తున్న జిల్లా కాంగ్రెస్ మహిళా అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, పట్టాభిరామిరెడ్డి.




నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని వేదవ్యాస హైస్కూల్‌లో వ్యక్తిత్వ వికాస నిపుణుడు గమనం పాల్గొన్న సదస్సులో విద్యార్థులు ఎలా చదువుకోవాలనే అంశాన్ని వివరిస్తున్న ఆ స్కూల్ విద్యార్థి కుష్వంత్.

# బిసి ఓటర్ల గుర్తింపులో వివక్ష!

## బిసి ఐక్య సంఘర్షణ సమితి ఆరోపణ

జిల్లాలోని కార్పొరేషన్, మునిసిపాలిటీ పరిధిలో బిసి ఓటర్ల గుర్తింపులో అధికారులు నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నారని బిసి ఐక్య సంఘర్షణ సమితి ఆరోపించింది. గూడూరులో సమితి ఆధ్వర్యంలో అధికారుల తీరును నిరసిస్తూ ధర్నా చేపట్టారు. అధికారులు బిసి కులాల వారిని ఓటర్ల జాబితాలో చేర్చకుండా వివక్ష చూపుతున్నారని విమర్శించారు. గూడూరు పురపాలక సంఘ పరిధిలో 41,046 మంది వుండగా అందులో 14,340 మందిని మాత్రమే బిసిలుగా గుర్తించారన్నారు. బిసిలకు అందే రిజర్వేషన్ ఫలాలను దూరం చేసేందుకే ఇలా వ్యవహరిస్తున్నారన్న అనుమానాన్ని వ్యక్తం చేశారు. ఇప్పటికైనా అధికారులు పక్షపాత ధోరణి విడనాడి బిసిలందరిని ఓటర్ల జాబితాలో నమోదు చేసేలా చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. ఈ సంఘర్షణ కార్యక్రమంలో బిసి ఐక్య కార్యాచరణ సమితి డివిజన్ కన్వీనర్ రామ్‌ప్రసాద్‌గౌడ్, బిరదరాజు బాలాజీరాజు, పూల చంద్రశేఖర్, బత్తిన మాధవరావు, శ్యాం తదితరులు పాల్గొన్నారు.

# సమస్యలలో గ్రామాలు

## పంచాయితీ కార్యదర్శుల కొరతే కారణం

గ్రామ పంచాయితీ కార్యదర్శుల కొరతతో ఇందుకూరుపేట మండలంలోని ప్రజల సమస్యలు నానాటికి అధికం అవుతున్నాయి. 20 పంచాయితీలు వున్న మండలంలో కార్యదర్శులు తక్కువ మంది వున్నారు. దీంతో ఒక్కొక్కరు రెండు పంచాయితీలు పర్యవేక్షించాల్సి రావడంతో సమస్యలు పేరుకపోతున్నాయి. రాముడుపాళెం, కుడితిపాళెం, నిడిముసలి, గంగపట్నం, సోమరాజుపల్లి, కొరుటూరులో పలు సమస్యలతో ప్రజలు సతమతం అవుతున్నా పట్టించుకొనేవారే లేకుండా పోయారు. ముఖ్యంగా త్రాగునీటి సమస్య ఈ ప్రాంతాలలో అధికంగా వుంది. నీటి సమస్యపై పలుమార్లు అధికారులకు తెలియజేసినా ఫలితం లేకుండా పోవడంతో మంచినీటికి కటకటలాడాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. వేసవి ప్రారంభంకాక ముందే ఇలాంటి పరిస్థితులు ఏర్పడుతుంటే మున్ముందు తమ పరిస్థితి ఏమిటా అని ప్రజలు ఆందోళన చెందుతున్నారు. మరో వైపు డ్రైనేజీ సమస్య ఆయా గ్రామాల వారిని రోగాల పాలు చేస్తుంది. చెత్త శుభ్రపరచకపోవడం, దోమలు విజృంభిస్తుండడంతో అంటురోగాలు ప్రబలుతున్నాయి. ఇటీవల కొరుటూరు గ్రామంలో డెంగ్యూవ్యాధితో ఒకరు మృతి చెందారు. ఇంతగా పరిస్థితులు అస్తవ్యస్తంగా మారినా కార్యదర్శులు, స్పెషలాఫీసర్లు ఎవరూ గ్రామాల ముఖం చూపకపోవడంతో పారిశుద్ధ్యం క్షీణిస్తోందని ప్రజలు వాపోతున్నారు..

# జగన్‌తోనే అభివృద్ధి సాధ్యం!



### నేదురుమల్లి పద్మనాభరెడ్డి

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి తనయుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డితోనే రాష్ట్రంలో అభివృద్ధి సాధ్యమవుతుందని ఆ పార్టీ నేత నేదురుమల్లి పద్మనాభరెడ్డి తెలిపారు. చిల్లకూరు మండలంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ చేపట్టిన ఇంటింటి ప్రచారంలో భాగంగా వరగలికి వచ్చిన ఆయన స్థానిక నేత వేమారెడ్డి శ్రీధర్‌రెడ్డి నివాసంలో విలేకరులతో మాట్లాడారు. కాంగ్రెస్ ప్రభుత్వం సంక్షేమ పథకాలను సక్రమంగా అమలు చేయలేక పోతుందని విమర్శించారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేద విద్యార్థుల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రవేశపెట్టిన ఫీజు రీఎంబర్స్‌మెంటు, స్కాలర్‌షిప్పులను ఇవ్వకుండా వారి జీవితాలతో చెలగాటం ఆడుతున్నారన్నారు. జగన్ ముఖ్యమంత్రిగా చూడాలని రాష్ట్రప్రజలు కోరుకుంటున్నారని ఆయన సిఎం అయితేనే తిరిగి రాష్ట్రంలో అభివృద్ధి సాధ్య మవుతుందన్నారు. ఈ సమావేశంలో వైఎస్ఆర్‌పార్టీ నేతలు శరత్‌కుమార్‌రెడ్డి, పాశం సునీల్‌కుమార్, సత్యం, నల్లపురెడ్డి వినోద్‌కుమార్‌రెడ్డి, విజయకుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# పోరాడి ఇళ్లు సాధించారు!

## మల్లిఖార్జునపురం వాసులు ఆదర్శనీయులు

తోటపల్లి గూడూరు మండలం మల్లిఖార్జునపురం గ్రామంలోని పేదలకు ఎట్టకేలకు గృహవసతి లభించనుంది. ఈ ప్రాంతంలోని ఎస్సీ, ఎస్టీ, బిసిలకు 165 ఇళ్లు మంజూరైనాయి. గృహ నిర్మాణశాఖ ఇళ్లను నిర్మించి ఇస్తామనడంతో ఉన్న గుడిసెలను పీకి పక్కాగృహాలకు సిద్ధమైన్నారు. ఇదిగో అదిగో అంటూ దాదాపు రెండేళ్లు గడిపేశారు అధికారులు. దీంతో కొత్త ఇళ్ల నిర్మాణంకాక, వున్న ఇంటిని కూలదోసుకొని రెంటికి చెడ్డ రేవడిలా మారింది పేదల పరిస్థితి. దీనిపై పోరాటకమిటీ ఏర్పడి అధికారులను కలిసి విన్నవించినా ఫలితం లేకపోవడంతో ఇళ్లు నిర్మించేందుకు వారే నడుంబిగించారు. పోరాట కమిటీ నేతృత్వంలో దశలవారీగా ఇళ్లను నిర్మించాలని తీర్మానించారు. దీనికి సంబంధించిన భూమి పూజను జిల్లారైతు సంఘం అధ్యక్షుడు గంగపట్నం రమణయ్య నిర్వహించారు.

# తహశీల్దార్‌ను నిర్బంధించారు!

భూవివాదాన్ని పరిష్కరించేందుకు వెళ్లిన తహశీల్దార్‌ను గ్రామస్తులు నిర్బంధించిన ఘటన ఓజిలి మండలం కర్రబల్లవోలులో జరిగింది. ఈ గ్రామంలో ప్రభుత్వ చెరువు పోరంబోకుకు సంబంధించిన 65 ఎకరాలను దళితులు, గిరిజనులతోపాటు కొందరు బిసిలు సాగు చేసుకొంటున్నారు. భూములపై వివాదం నెలకొనడంతో పలువురు కోర్టును ఆశ్రయించి వున్నారు. తాజాగా హైకోర్టు ఉత్తర్వుల మేరకు జిల్లా కలెక్టర్ ఆదేశాలతో తహశీల్దార్ జిలానీ బాషా భూములను స్వాధీనం చేసుకొనేందుకు వెళ్లగా గ్రామానికి చెందిన కొందరు అధికారులతో గొడవకు దిగడంతోపాటు తహశీల్దార్‌ను నిర్బంధించారు. రెవెన్యూ సిబ్బంది గ్రామస్తులకు అధికారుల ఆదేశా

### కర్రబల్లవోలు గ్రామస్తులకు కోపమొచ్చింది

లను వివరించినా ఫలితం లేకుండా పోయింది. ఈ సమాచారం అందుకున్న పోలీసులు అక్కడకు చేరుకొని తహశీల్దార్‌ను ప్రజల చెర నుంచి విడిపించారు.



కొడవలూరు మండలం రామన్నపాళెంలో ఎన్నికల ప్రచారం చేస్తున్న కోవూరు తెలుగుదేశం పార్టీ అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.

- కలగానే

# కావలి స్టేడియం!

కావలి పట్టణంలో నిర్మించదలచిన స్టేడియం శిలాఫలకానికే పరిమితమైంది. 2000 సంవత్సరంలో ఆనాడు హోం మంత్రిగా వుండిన దేవేందర్‌గౌడ్ ఈ శిలాఫలకాన్ని వేశారు. ఆనాటి నుంచి పుష్కరం గడుస్తున్నా ఒక్క అడుగు ముందుకు పడకపోవడంతో పట్టణ ప్రజలు స్టేడియంపై ఆశ వదిలేసుకున్నారు. రెండవ పట్టణ పరిధిలో స్టేడియం అవసరాన్ని గుర్తించిన అధికారులు, పాలకులు దీన్ని నిర్మించదలచారు. ప్రభుత్వం నుంచి అనుమతి రావడం, రాష్ట్ర స్పోర్ట్స్ అథారిటీ పది లక్ష రూపాయలు సైతం మంజూరు చేసింది. నిర్మాణ పనులను పంచాయితీరాజ్ అధికారులకు అప్పగించారు. జిల్లా క్రీడా ప్రాధికార సంస్థ ఛైర్మన్ హోదాలో జిల్లా కలెక్టర్, కార్యదర్శి అయిన

### 2000 సంవత్సరంలో శంకుస్థాపన

డిఎస్‌డిఓ పనులు పర్యవేక్షణ చేపట్టి ఇందుకోసం 9ఎకరాల భూమిని కేటాయించారు. ఆనాటి నుంచి నిర్మాణ పనులు నిలచిపోయాయి. కావలికి వచ్చిన సందర్భంలో హోంమంత్రి శిలాఫలకం వేసిన తర్వాత వేగంగా పనులు జరుగుతాయని ఆశించిన క్రీడాకారులు, క్రీడాభిమానులకు నిరాశే ఎదురయ్యింది. గత 12 ఏళ్లగా ఎక్కడి వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా వుంది పరిస్థితి. పలువురు దాతలు తమవంతు సహకారం అందించేందుకు ముందుకు వచ్చారు. వీరిలో ప్రస్తుత శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు, మాగుంట పార్వతమ్మ, వంటేరు వేణుగోపాలరెడ్డి వున్నారు. అన్నీ వున్నా అల్లుడినోట్లో శని అన్న చందంగా వుంది స్టేడియం నిర్మాణం. బీద మస్తాన్‌రావు ఈ విషయంలో చొరవ చూపి నిర్మాణం జరిగేలా చూడాలని పలువురు కోరుకొంటున్నారు.

# ధర లేక రైతుల విలవిల

## గెనుసుగడ్డకు గిట్టుబాటు ధర లేదు

జిల్లాలో వివిధ ప్రాంతాలలో అధికంగా గెనుసుగడ్డలు సాగు చేసిన రైతులు ధరలు పడిపోవడంతో తీవ్రంగా నష్టపోతున్నారు. ఖర్చులు అధికం కావడం దానికి తగినట్లు రాబడి వుండకపోతుండడంతో రైతులు ఆందోళన చెందుతున్నారు. సంగం మండలంలోని రైతాంగం ఈసారి 60 ఎకరాలకు పైగా విస్తీర్ణంలో గెనుసుగడ్డల సాగు చేపట్టింది. అన్నారెడ్డిపాళెం, జెండాదిబ్బ, అరవపాళెం, పడమర పాళెం, పల్లిపాళెంలో రైతులు అధిక లాభాలు వస్తాయన్న ఆశతో ఉత్సాహంగా ఈసాగు చేపట్టారు. వ్యవసాయాధికారుల సూచనలు, సలహాలు పాటిస్తూ చీడపీడల మందులు, రసాయనిక ఎరువులు ఉపయోగించి ఉత్పత్తి అధికం చేశారు. ఎకరానికి 20క్వింటాళ్లకు పైగా దిగుబడి వస్తుందని ఆశించి అందుకుగాను ఒక్కో ఎకరాకి ఆరువేల రూపాయలకు పైగా ఖర్చు చేశారు. ఇంతచేసినా గెనుసుగడ్డల ధరలు పడిపోవడంతో తీవ్రంగా నష్టపోయారు రైతులు. ఎంతో వ్యయప్రయాసకోర్చి వీటిని సాగు చేస్తున్న తమను ఆదుకోవాలని, మద్దతు ధర కల్పించాలని డిమాండ్ చేస్తున్నారు రైతులు.



అల్లూరు రామకృష్ణ డిగ్రీ కాలేజిలో బిఎస్సీ విభాగంలో ఫస్ట్ ర్యాంకర్ సుజితకు 10వేల రూపాయల ప్రోత్సాహకాన్ని విక్రమ సింహపురి యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ జి.రాజారామ్‌రెడ్డి చేతుల మీదుగా అందిస్తున్న కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు. చిత్రంలో యూనివర్సిటీ రిజిస్ట్రార్ నారాయణరెడ్డి వున్నారు.

## జామియా మసీదుకు నూతన కమిటీ

కాంగ్రెస్‌పార్టీకి అండదండలు అందిస్తున్న ముస్లింలు ఇదే ఆదరాభిమానాలను చిరకాలం కొనసాగించాలని మాజీ ఎమ్మెల్యే మాగుంట పార్వతమ్మ కోరారు. కావలి పట్టణంలో గల జామియా మసీదుకు నూతన పాలక మండలి ఏర్పాటైంది. నూతన కమిటీ ఈ సందర్భంగా పార్వతమ్మను ఆమె నివాసంలో కలసి సన్మానించి తమ అభిమానాన్ని చాటుకొన్నారు. ఆ కమిటీని ఉద్దేశించి పార్వతమ్మ మాట్లాడుతూ మసీదును రాజకీయాలకు అతీతంగా అభివృద్ధి పరచాలని కోరారు. మున్సిపల్ మాజీ ఛైర్మన్ గ్రంధి యానాదిశెట్టిని సన్మానించిన మసీదుకమిటీ అధ్యక్షుడు పీర్‌మహమ్మద్ మాట్లాడుతూ, 37ఏళ్లుగా ఒకే కుటుంబ పాలనలో వున్నప్పటికీ మసీదు అభివృద్ధికి నోచుకోలేదన్నారు. మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, మాజీ శాసనసభ్యులు మాగుంట పార్వతమ్మ, విష్ణువర్ధన్‌రెడ్డి, యానాదిశెట్టిల సహకారంతో నూతన కమిటీని ఏర్పాటు చేసుకోగలిగామన్నారు. ఈ కార్యక్రమంలో జామియా మసీదు కమిటి ఉపాధ్యక్షుడు జిలానీబాషా, కార్యదర్శి ఎస్ఎన్‌బి నజీర్, గౌరవాధ్యక్షుడు రషీద్, మహిళా కాంగ్రెస్‌నేత పర్వీన్‌జానీ తదితరులు పాల్గొన్నారు.

## 14 కోట్లతో పాలప్రగతి కేంద్రాలు

జిల్లాలో పాల ఉత్పత్తిని పెంచేందుకు పాలప్రగతి కేంద్రాలను ఏర్పాటు చేసేందుకు అధికారులు రంగం సిద్ధం చేస్తున్నారు. ఇందుకోసం 14.60కోట్ల రూపాయలు మంజూరు చేయడంతో ఐకెపి ద్వారా మొత్తం 292 పాలప్రగతి కేంద్రాలను ఏర్పాటు చేయనున్నారు. వీటి ద్వారా స్వయం సహాయక గ్రూపులకు ప్రాధాన్యత కల్పించాలన్నది ఉద్దేశం. డిఆర్‌డిఏ అధికారులు, బ్యాంకర్ల సమన్వయంతో ఒక కార్యచరణ ప్రణాళిక రూపొందించారు. ఈ కేంద్రాల ఏర్పాటులో భాగంగా 11 మండలాల్లో ఎస్సీ, ఎస్టీలకు 138 కేంద్రాలను, మిగతా 154 కేంద్రాలను ఇతర స్వయం సహాయక గ్రూపులకు కేటాయించనున్నారు. ప్రతిచోట ముర్రాజాతి గేదెలను, ఎనిమిదికి తగ్గకుండా ఆవులను వుండేలా చర్యలు చేపట్టారు. వీటి యూనిట్ వ్యయం ఐదు లక్షల రూపాయలు కాగా, అందులో 50వేల రూపాయలు గ్రూపులే భరించాల్సి వుంటుంది. మిగతా మొత్తాన్ని బ్యాంకుల ద్వారా అందజేస్తారు. ఈ కేంద్రాలు సక్రమంగా పనిచేస్తే మరిన్ని కేంద్రాలు తెరచే అవకాశముందని అధికారులు చెప్తున్నారు. గడ్డి పెంచేందుకు గ్రామీణ ఉపాధి పథకం ద్వారా యూనిట్‌కు 3.15 లక్షలు కేటాయించారు. మండలస్థాయిలో ఎంపిడిఓ, సంబంధిత బ్యాంకు అధికారులు, పశువైద్యులు, కమిటీగా ఏర్పడి గ్రూపులను నిర్ణయిస్తారు.

## బోగోలులో ధాన్యం కొనుగోలు కేంద్రం

బోగోలు మండలంలో ధాన్యం కొనుగోలు కేంద్రాన్ని జిల్లా పౌరసరఫరాల శాఖాధికారి ఉమామహేశ్వరరావు ప్రారంభించారు. రైతులు పండించిన ధాన్యానికి గిట్టుబాటు ధరను కల్పించాలన్న లక్ష్యంతో ప్రభుత్వం ఈ కేంద్రాలను ఏర్పాటు చేసిందన్నారు. జిల్లా వ్యాప్తంగా మొత్తం 96 ధాన్యం కొనుగోలు కేంద్రాలను ప్రారంభించనున్నట్లు తెలిపారు. బోగోలు, వెంకటాచలం మండలాల్లో ధాన్యాన్ని నిల్వ చేసుకొనేందుకు గిడ్డంగులను 1.50కోట్లతో ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు.

## మండల కన్వీనర్ల నియామకం

కావలి నియోజక వర్గంలో గల నాలుగు మండలాలకు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ మండల కన్వీనర్లను నియమించింది. కావలి మండలానికి చింతం బాబురెడ్డి, బోగోలు మండలానికి తూపిలి పెంచలయ్య, అల్లూరుకు దండే కృష్ణారెడ్డి, దగదర్తి మండల కన్వీనర్‌గా గోగుల వెంకయ్యను నియమించినట్లు ఆపార్టీ జిల్లా కన్వీనర్, జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తెలిపారు.

# ఉపన్యాసాలతో స్మగ్లర్లు మారుతారా?

ఒకవైపు ఎర్రచందనం అక్రమరవాణా యదేచ్ఛగా జరుగుతుండడం, స్మగ్లర్లను పట్టుకొంటే గ్రామస్తులు ఫారెస్టు అధికారులపై దాడులకు దిగుతున్న పరిస్థితుల్లో అలాంటి ఘటనలు జరగకుండా కఠినంగా స్మగ్లింగ్‌ను అరికట్టాల్సిన ఉన్నతాధికారులు ఆ పని మాని సదస్సుల పేరుతో ఊకదంపుడు ఉపన్యాసం ఇస్తుండడం పట్ల తీవ్ర విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. పోలీసుశాఖను సమన్వయపరచుకొని ఎర్రచందనం స్మగ్లింగ్‌ను అరికడతామని అధికారులు చెప్తున్న మాటలు కేవలం చేతలకే పరిమితం అవుతున్నాయి తప్ప కార్యరూపం దాల్చడం లేదు అనేందుకు ఇటీవల జిల్లాలో జోరందుకున్న ఎర్రచందనం అక్రమ రవాణానే నిదర్శనం. ఈ నేపథ్యంలో వెంకటగిరిలో అటవీశాఖ, పోలీసుశాఖ సంయుక్తంగా కొండక్రింది గ్రామమైన సిద్ధవరంలో అటవీ పరిరక్షణపై అవగాహన సదస్సు నిర్వహించారు. డిఎఫ్ఓ నాగేశ్వరరావు సైన్సు అధ్యాపకుడి అవతారం ఎత్తి విద్యార్థులకు పాఠాలు బోధించినట్లు అడవులు అంతరిస్తే పర్యావరణానికి కలిగే నష్టాన్ని వివరించారు. గూడూరు డిఎస్పీ సురేష్‌కుమార్ మాట్లాడుతూ ఎర్రచందనం చెట్లను నరకడం వలన వృక్ష సంపద అంతరిస్తుందన్నారు. ఇలాంటి మాటలతో రైతు కూలీలలో మార్పు వస్తుందా? అన్నీ పలువురు చర్చించుకొంటు

### సదస్సులతో అటవీశాఖాధికారులు బిజీ

న్నారు. దీనికి బదులు చందనం చెట్లు నరకడానికి వెళ్లే కూలీలకు ఉపాధి చూపితే కొంతమేర మార్పు వస్తుంది కాబట్టి అలాంటి పథకాలు చేపట్టాలని కోరుతున్నారు పలువురు. ఈ సదస్సులో వెంకటగిరి సిఐ అబ్దుల్ కరీం, ఎస్ఐ అన్వర్‌బాషా, ఫారెస్టు రేంజర్ చెన్నయ్య తదితరులు పాల్గొన్నారు.

# సర్వదేవతావ్రత సమాహార మాసం ఫాల్గుణం!



కాల స్వరూపుడైన భగవంతుడు చైత్ర మాసంలో బ్రహ్మ సృష్టి జరిపారంటారు. ఆ మాసం నుంచి వచ్చే పన్నెండు మాసాలలో చిట్టచివరిది ఫాల్గుణ మాసం. ఈ ఫాల్గుణం ఎన్నో పండుగలకు నెలవు. గడిచిన పదకొండు నెలల్లో చేసిన దేవతా పూజలు, వ్రతాలన్నీ ఈ చివరి మాసమైన ఫాల్గుణంలో ఈ మాసంలో కన్పించడం విశేషం. సర్వదేవతావ్రత సమాహారంగా, సర్వవ్రత సింహావలోకనంగా కన్పిస్తుంది. దీని తర్వాత కొత్త సంవత్సరం ఆరంభమవుతుంది. ఉత్తర ఫాల్గుణ నక్షత్రంతో కూడిన పౌర్ణమి వున్న మాసం ఇది. శిశిరం ముగిసి వసంతానికి స్వాగతం చెబుతూ కొత్త కాంతులు విచ్చుకొనే మాసం.

ఫాల్గుణ మాసం విష్ణువుకు ప్రీతికరం అంటోంది భాగవతం. గడచిన 11 మాసాల్లో కారణాంతరాల వల్ల వ్రతాలు, పూజలు జరుపుకోలేని వారు అలాంటి పండుగలను, వ్రతాలను చేసుకొనే వీలున్న మాసం ఫాల్గుణం. ఎన్నో ప్రధానమైన పండుగలకే కాక ఆధ్యాత్మిక వేత్తల జయంతులకు నెలవైన మాసం ఫాల్గుణం. బహుళ ద్వాదశినాడు రామకృష్ణ పరమహంస జయంతి, చతుర్దశినాడు ఆర్యసమాజ స్థాపకుడు స్వామి దయానంద సరస్వతి జయంతి వస్తుంది. నీలకంఠ, బోదనా ఋషులు ఈ నెలలోనే జన్మించారు. శ్రీకృష్ణతత్వాన్ని విశ్వ




వ్యాప్తం చేసిన చైతన్య ప్రభువు జన్మించిన మాసం ఇది. శుద్ధపౌర్ణమి నాడు భద్రచతుష్టి వ్రతం, విదియనాడు మధూకం లాంటి వ్రతాలు చేస్తారు. అలాగే చవితినాడు అవిఘ్న గణపతి వ్రతం, డూండీరాజవ్రతం, పంచమినాడు పంచమీ వ్రతం, సప్తమినాడు అర్కసంపుట సప్తమీ వ్రతం, అష్టమినాడు లలితకాంతి వ్రతం, నవమి నాడు ఆనందనవమి వ్రతం, ఏకాదశినాడు అమలక వ్రతం, ద్వాదశినాడు గోవింద ద్వాదశివ్రతం, చతుర్దశినాడు మహేశ్వర వ్రతం తదితర వ్రతాలు చేస్తారు. ఫాల్గుణ మాసంలో వచ్చే పూర్ణిమను మహాఫాల్గుణిగా పిలుస్తారు. రంగుల పండుగ అయిన హోలీ వచ్చేది ఈ మాసంలోనే. శ్రీహరిని ఈ మాసంలో పూజించి క్షీరాన్నాన్ని నివేదిస్తే అభీష్టం సిద్ధిస్తుందని భాగవతం చెప్తుండగా, మాసం యొక్క విశిష్టతను మత్స్య పురాణంలో వివరించబడింది. ముఖ్యంగా ఫాల్గుణ మాసంలో శుక్లపక్ష పాడ్యమి నుంచి ద్వాదశి వరకు విష్ణువును పూజించేందుకు మహాఉత్కృష్టమైన రోజులుగా చెప్తున్నాయి పురాణాలు.

J

## ట్రంకు రోడ్డు

### తనదాకా వస్తేనే....

నెల్లూరు ఆర్టీఓ కార్యాలయంలో ఏ పని జరగాలన్నా ఏజంట్లను ఆశ్రయించాలి. కానీ ఆర్టీఓ రాంప్రసాద్ మాత్రం తన కార్యాలయం చుట్టుప్రక్కల ఏజంట్లు లేరని బుకాయిస్తుంటాడు. ఈవారంలో తన వాహనం వేసుకొని కార్యాలయానికి వస్తుండగా కారుపోను దారి లేకుండా ఏజంట్ల ఆఫీసుల ముందు పార్కింగ్ చేసిన స్కూటర్లు కనిపించాయట. దీంతో చిర్రెత్తిన సారు వారు వాహనం దిగి నడచి కార్యాలయంలోకి వెళ్లి బ్రేక్ ఇన్స్‌పెక్టర్ల చేత వాహనాలపై దాడులు చేయించారు. ఏజంట్లను కార్యాలయం వద్ద లేకుండా చేయలేక మామీద ఎందుకు ప్రతాపం చూపిస్తారని జనం తిరగబడే సరికి రవాణాశాఖ సిబ్బంది సర్దుకోవడం ట్రంకు రోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

### దొంగల పనా... దొరల పనా?

నెల్లూరు నగర వీధుల్లో పార్క్ చేసి వున్న ద్విచక్ర వాహనాలను తస్కరించేవారు ఎక్కువయ్యారు. అధికారిక లెక్కల ప్రకారం గత ఏడాది 700 ద్విచక్ర వాహనాలు చోరీ అయ్యాయి. ఈ చోరీలపై క్రైం పోలీసుల వైఫల్యాన్ని ఎలుగెత్తి చాటాలనో లేకుంటే వాహనం పోయినవారి బాధను తెలియచేయాలనో తెలియదు గాని సెంట్రల్ క్రైం పోలీస్‌స్టేషన్‌లో పార్క్ చేసిన ట్రాఫిక్ సర్కిల్ ఇన్స్‌పెక్టరు వెంకటేశ్వర్లు వాహనం ఎవరో పట్టుకెళ్లిపోయారు. ఎస్పీతో జరిగిన క్రైం మీటింగ్ హాజరై వచ్చేసరికి తన స్కూటర్ మాయమవడంతో ముందు సిబ్బందిపై తనదైన ధోరణితో బూతులకు లంఘించుకొన్న సిఐ ఆతర్వాత మూడవపట్టణ పోలీస్ స్టేషన్‌లో తన స్కూటర్ పోయిందని ఫిర్యాదు చేయడం కొసమెరుపు.

### ఎస్ఎంఎస్‌ల డిపీఆర్వో!

జిల్లా పౌరసంబంధాల అధికారిని ఆంగ్లంలో సంక్షిప్తంగా డిపిఆర్వో అంటారు. ప్రస్తుతం జిల్లా పౌరసంబంధాల అధికారిగా వ్యవహరిస్తున్న మాగుంట కమలాకర్‌రెడ్డి గారికి జిల్లాలో పనిచేస్తున్న పాత్రికేయులు, ఎలక్ట్రానిక్ మీడియాతో పెద్దగా పరిచయాలు లేవు. పాత డిపిఆర్వోలు గతంలో ప్రతి దినం ఫోన్‌లో వార్తల విషయమై జిల్లా కేంద్రంలోని పాత్రికేయులతో మాట్లాడేవారు. వారానికోసారి వివిధ కార్యక్రమాలలో మీడియాతో కలిసేవారు. ఇప్పటి డిపిఆర్వో ఫోన్‌లో ఎవరితోనూ మాట్లాడరు. ఏదైనా ప్రభుత్వ కార్యక్రమం కవరేజికి మీడియా హాజరవ్వాలంటే ఓ ఎస్ఎంఎస్ ఇచ్చి ఊరుకొంటారు. పూర్వాశ్రమంలో ఈయన టైపిస్ట్ కావడంతో ఈ తరహాలో నడుస్తున్నాడని భావించాలేమో. పత్రికల వారితోనే సంబంధ బాంధవ్యాలు నెరపని ఈయన ప్రజలతో ఏం మాట్లాడుతారు? జిల్లా పౌరసంబంధాలశాఖాధికారి అనే పేరును ఎలా నిలబెట్టుకొంటారు??

### స్వర్గం... నరకం ఇక్కడే...

వృత్తిపరంగా వ్యక్తిపరంగా వివాదాస్పదుడైన జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం ఇటీవల జరిగిన ప్రధానోపాధ్యాయుల సమావేశంలో మెట్ట వేదాంతాన్ని చెప్పడం ఉపాధ్యాయ లోకంలో చర్చనీయాంశమయ్యింది. విధి నిర్వహణలో అవినీతి అక్రమాలకు పాల్పడితే నరకానికి పోతారని, మంచి పనులు చేస్తే స్వర్గానికి పోతారని చెప్పుకొచ్చారాయన. షుగర్, బిపిలు కూడా చెడ్డ ఆలోచనలు చేస్తే వస్తాయని, మంచి ఆలోచనలు చేస్తే అయ్యోర్లు ఆరోగ్యంగా హుషారుగా వుంటారన్నారు. డిఇఓ గారికి స్థాయికి మించి షుగర్ వుందట. ఇది ఎందుకొచ్చిందనేది ఆయనే చెప్పి వుంటే బాగుండేదని ఉపాధ్యాయులు చెవులు కొరుక్కొంటున్నారు. దీనికి డిఇఓ ఏమంటారో?

### చాక్లెట్ల మూట!

జిల్లా కలెక్టర్ క్యాంపుకు బయలుదేరారంటే ఆయన కారులో అత్యవసరంగా పరిశీలించాల్సిన ఫైళ్లు, భోజనం క్యారియర్లు, మంచినీళ్లు, క్యాంప్ క్లర్క్, అటెండరు తప్పనిసరిగా వుంటారు. కాని ఇప్పటి కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి క్యాంప్‌కు బయలుదేరే సమయంలో ఐదు కిలోలకు తక్కువ కాకుండా చాక్లెట్ల మూట దర్శనమిస్తుంది. తాను పరిశీలనకు వెళ్లిన ప్రాంతంలో చిన్న పిల్లలు కనబడితే చాలు నాలుగు చాకెట్లు వారి చేతిలో పెడుతున్నారాయన. కలెక్టరేట్‌లో విధులు నిర్వహించే సమయంలోనూ, ప్రజావిజ్ఞప్తుల దినంలోనూ ఎవరైనా పిల్లలతో వస్తే ముందు చాక్లెట్లు ఇచ్చి ఆ తర్వాత సమస్య వింటున్నారు.

# మురళీకృష్ణ గోపాలయ్యకు జీవిత సాఫల్య పురస్కారం!

హోటళ్ల స్థాపన, నిర్వహణలో నెల్లూరీయులు ప్రపంచవ్యాప్త ప్రఖ్యాతి పొందారు. కాని నోరూరించే నెల్లూరు రుచులకు 'మురళీకృష్ణ' హోటల్ నిర్వాహకుడు గ్రోసు గోపాలయ్య పెట్టింది పేరుగా నిలిచారు.

హోటళ్ల రంగంలో 44ఏళ్ల క్రిందట అడుగిడి అంచెలంచెలుగా ఎదిగి, జిల్లా, రాష్ట్ర స్థాయిలో గుర్తింపు పొందారు. ఏపీ హోటల్స్ అసోసియేషన్ ఆధ్వర్యాన ఆతిథ్య రంగంలో ఎపిక్యురస్ జీవిత సాఫల్య పురస్కారం – 2012ను హైదరాబాద్‌లో మంత్రి గీతా రెడ్డి చేతుల మీదుగా ఈ వారంలో అందుకున్నారు. ఆయన మురళీకృష్ణ గోపాలయ్యగా అందరికీ సుపరిచితుడే. కృషి, పట్టుదలకు గుర్తింపే ఈ పురస్కారమంటున్నారాయన. స్నేహితుని సహాయంతో ఈ రంగంలో అడుగుపెట్టాను. బతుకు పాఠాలు, విలువలూ నేర్చుకున్నాను. ఇడ్లీ 10పైసలు, వడ 10 పైసలు, కాఫీ 15 పైసల ధరలతో హోటల్ నడిపే రోజుల నుంచి ఎన్నో మలుపులు, అందులో నెల్లూరు పాత మద్రాసు బస్టాండు వెంకటేశ్వర భవన్ మరువలేనిది. ఆ హోటల్ యజమాని చనిపోవడంతో హోటల్ నడిపే బాధ్యతలు తీసుకున్నాను. ఆ భవన్‌కు నా చిన్నకుమారుడు మురళీ కృష్ణ పేరు పెట్టాను. ఆ రోజుల్లో స్నేహితుల సహాయం మరువలేనిది. బస్టాండు హోటల్స్‌లో తిండి బాగుండదనే అభిప్రాయాన్ని మార్చాలని రోజుకు 22 గంటలు పనిచేశాను. 1977లో ప్రకాశం పంతులు భవన్‌లోకి హోటల్ మార్చాను. వ్యాపారం అభివృద్ధి చెందింది. నెహ్రూ బొమ్మ ఏర్పాటు చేయడంతో ఆ బిల్డింగ్ నుంచి మారాల్చి వచ్చింది. మునిసిపాలిటీ నుంచి నష్టపరిహారం తీసుకోలేదు. అయితే అన్నేళ్లు నా అభివృద్ధికి తోడ్పడి, నన్ను ఈ స్థాయికి తీసుకొచ్చిన హోటల్ 1970లో ప్రారంభం కావడంతో దానికి గుర్తుగా హోటల్ పేరును మురళీకృష్ణ70గా మార్చాను. వ్యాపార విస్తరణకు ఎన్నో ప్రయోగాలు చేశాను. వాటిల్లో కొన్ని ఫలించాయి. హోటళ్ల రంగంలో మురళీకృష్ణ పేరు చెక్కు చెదరని స్థానం సంపాదించుకుంది.

## ఉన్నంతలో సేవ

ఉన్నంతలో ప్రజలకు సేవ చేయడం అలవరచుకొన్నా. మా కుల సంఘమైన గాండ్ల తెలికుల సంఘం ద్వారా ప్రజల్లో చైతన్యం కలిగిస్తున్నా. విద్యార్థుల చదువు కోసం అనేక చర్యలు చేపడుతున్నా. ప్రోత్సాహక బహుమతులు అందజేస్తున్నా. వృద్ధాశ్రమంలో 25మందికి ఉచితవసతి, భోజన సౌకర్యం కల్పిస్తున్నాం. ఏడాదిగా శ్రీశైలం దేవస్థానంలో నిత్యాన్నదానం చేస్తున్నాం. 40 గదులతో సత్రాన్ని ఏర్పాటు చేసినట్లు వివరించారాయన.

# వారఫలాలు

*తేది 25-02-2012 నుండి 2-03-2012 వరకు మేషంలో గురువు; వృషభంలో కేతువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; కుంభంలో రవి, బుధులు, 27తేది నుంచి బుధుడు మీనంలో; మీనంలో శుక్రుడు 29తేది వరకు తదుపరి మేషంలో; మీన, మేష, వృషభాలలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

ఈ వారం చేసే పనులలో కొంత జాప్యం జరుగుతుంది. రుణాలు చేయవలసి రావచ్చు. బంధుమిత్రులతో అవసర విషయాలు చర్చిస్తారు. ఇంటా బయట త్రిప్పట, శ్రమాధిక్యత లుంటాయి. వాహన, వస్త్రాభరణాలను కొనగలరు. ఉద్యోగులు సంతోషమైన వార్తలు వింటారు. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థిక పుష్టి వుంటుంది. విద్యార్థులకు అనుకూల సమయం.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

కుటుంబపరంగా తీసుకొనే నిర్ణయాలలో తొందర పనికిరాదు. గృహ నిర్మాణాది కార్యక్రమాలు నిదానంగా గానీ, ఆగడం కానీ జరగవచ్చు. వృత్తి, వ్యాపార రంగాలలోని వారికి వ్యాపార లావాదేవీలు మందకొడిగా వుంటాయి. వ్యవసాయ రంగంలోని వారికి ఆదాయం తగ్గుతుంది. విద్యార్థులు శ్రమానంతరం ఫలితాలు సాధిస్తారు. క్రీడా, కళా రంగాలలోని వారికి నిరాసక్తత వుంటుంది.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ఆర్థికాదాయాలు సంతృప్తినిచ్చినా, చేసే పనులలో తాత్సారం చేస్తే నష్టం కలిగిస్తాయి. కుటుంబ ఆస్తి వివాదాలకు పరిష్కారం లభిస్తుంది. విద్యార్థులకు ఈ వారం కొంత వూరట. వ్యవసాయ రంగంలోని వారు ఆర్థికంగా పుంజుకొంటారు. కళారంగంలోని వారికి మంచి గుర్తింపు, సన్మానాలుంటాయి. క్రీడా రంగంలోని వారికి ఉత్సాహం, విదేశీ లేదా దూరప్రయాణాలు చేయగలరు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ఎన్ని ఆటంకాలు ఎదురైనా పట్టుదలతో పనులు పూర్తి చేస్తారు. వివాహాది శుభకార్య ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వస్తు, వాహనాభరణాలు కొనుట, బంధుమిత్రులతో మృష్టాన్న భోజనం. విద్యార్థులకు అనవసర ఆటంకాలు ఎదురౌతాయి. వ్యవసాయ రంగంలోని వారికి ఆశాజనకంగా వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

చేసే పనులు లాభించి అదనపు ఆదాయం సమకూర్చుకోగలరు. నిరుద్యోగులకు ఉద్యోగావకాశాలు, విద్యార్థులకు చదువుపై ఆసక్తి వుంటుంది. వ్యవసాయదారులు చేసే నూతన ప్రయత్నాలు ఫలిస్తాయి. కళా, సాహిత్య, పారిశ్రామిక, క్రీడా, రాజకీయ రంగాల వారికి బాగుంటుంది. అనుకున్న పనులన్నీ ప్రణాళికాబద్ధంగా పూర్తి చేస్తారు. నూతన గృహనిర్మాణం లేదా స్థలం కొనుగోలు యత్నం ఫలిస్తుంది.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

ఈవారం మంచి చెడుల కలయికగా వుంటుంది. విందు వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. విద్యార్థులు పైచదువుల విషయమై కీలక నిర్ణయం తీసుకొంటారు. సోదర, సోదరీమణులతో భేదాభిప్రాయాలు రావచ్చు. వ్యవసాయదారులు ఓర్పు, సహనంతో పనులు పూర్తి చేస్తారు. కళా, క్రీడా రంగాలలో వారికి అవకాశాలు నిరుత్సాహపరుస్తాయి. తీర్థయాత్రలు, నూతన పరిచయాలు లాభిస్తాయి.

## పంచాంగం

25తేది తిలచతుర్థి – పుత్ర గణపతి వ్రతం.
26తేది శ్రీకంఠ జయంతి.

### శుభ ముహూర్తాలు

25, 26తేదీలలో వివాహ, డోలారోహణ, అన్నప్రాసనాదులకు సుముహూర్తాలున్నాయి.

### ఫిబ్రవరి తిథులు

**ఫాల్గుణ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 25 | శని | తదియ | ఉ 07.37 | గం.ల.వ |
| 26 | ఆది | చవితి | ప 08.59 | గం.ల.వ |
| 27 | సోమ | పంచమి | ప 12.21 | గం.ల.వ |
| 28 | మంగళ | షష్ఠి | ప 03.02 | గం.ల.వ |
| 29 | బుధ | సప్తమి | సా 05.38 | గం.ల.వ |
| 1 | గురు | అష్టమి | సా 07.53 | గం.ల.వ |
| 2 | శుక్ర | నవమి | రా 09.33 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

ఈ రాశి వారి ఆర్థిక పరిస్థితి చిన్నాభిన్నమవుతుంది. అనుకున్న పనులు నెరవేరకపోవటం, ఇతరులతో మాట పట్టింపులు, శరీరారోగ్య లోపం, అలసట, తొందపాటు వుంటాయి. వివాహాది శుభకార్యాలలో పాల్గొంటారు. వృత్తి, వ్యాపార రంగాలలోవారికి అభివృద్ధి, ఉద్యోగాలలోని వారికి అనుకూలతలు వుంటాయి. కానీ కుటుంబంలో సమస్యలు రాకుండా జాగ్రత్తపడవలెను.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

ఆర్థికంగా వెనుకబాటుతనం, రుణ ప్రయత్నాలు, దూర ప్రయాణాలు, బంధుమిత్రులతో మాట పట్టింపులు, కుటుంబంలో ఆస్తి విషయమై గొడవలు చీకాకు కలిగిస్తాయి. వృత్తి, వ్యాపార రంగాల వారికి సామాన్యంగా వుంటుంది. ఉద్యోగ రంగాల వారికి స్వల్ప మార్పులుంటాయి. విద్యార్థులు పై చదువులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవసాయం చేసే వారిని ఆర్థిక, ఆరోగ్య సమస్యలు బాధిస్తాయి.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

ఆకస్మిక ప్రయాణాలు, ఆరోగ్య లోపాలుంటాయి. ఉద్యోగులు పై అధికారులతో జాగ్రత్తగా వుండాలి. ఒక వార్త మిమ్ములను బాధిస్తుంది. ఆర్థికంగా కూడా మందకొడిగా వుంటుంది. కుటుంబంలో వివాహాది శుభకార్యాలకు ఆటంకాలు, కుటుంబంలో సమస్యలు చికాకు కలిగిస్తాయి. రుణాలు చేయవలసి రావచ్చు. విద్యార్థులకు అన్ని విధాల బాగుంటుంది. వ్యవసాయదారులకు ఆర్థికంగా బాగుంటుంది.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

చేసే పనులలో పురోభివృద్ధి, ఆర్థికంగా బాగుంటుంది. విద్యార్థులు తమ పురోభివృద్ధికై పరిశోధనాత్మక విషయాలపై ఆసక్తి చూపుతారు. వ్యవసాయదారుల ఆర్థికాదాయం తమ శక్తియుక్తులపై ఆధారపడి వుంటుంది. కళా, క్రీడా రంగాలవారి కార్యక్రమాలు ఆశాజనకంగా వుంటాయి. దూర ప్రయాణాలు, పుణ్యక్షేత్ర సందర్శన, తీర్థయాత్రలు చేయగలరు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలోని వారు చేసే పనులలో కొత్త నిర్ణయాలు తీసుకొంటారు. చేపట్టిన పనులన్నీ పూర్తి చేస్తారు. విద్యార్థులు విజయం సాధిస్తారు. వ్యవసాయ రంగంలోని వారికి సామాన్యం. ఎన్ని సమస్యలొచ్చినా మానసికంగా ధైర్యంగా వుంటారు. శత్రువులు మిత్రులుగా మారుతారు. రాజకీయ రంగంలోని వారికి అన్ని ఒడిదుడుకులు తొలగి, సమస్యల నుంచి బయటపడతారు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

చేపట్టిన పనులు ఎలాంటి అడ్డంకులు లేకుండా పూర్తి చేస్తారు. మాట పట్టింపులు, వివాదాలకు దూరంగా వుండండి. అవసరానికి ధనం అందుబాటులో వుంటుంది. శరీరారోగ్యం బాగుంటుంది. ఇంట్లో చేసే శుభకార్యాలకు ఇది మంచి సమయం. ఒక శుభవార్త మిమ్ములను సంతోషపరుస్తుంది. వ్యవసాయరంగంలోని వారికి సామాన్యంగా వుంటుంది.

# ద్వార వేధతో దిష్టి దోషాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎన్.ఉషాబాటియా — నెల్లూరు*

* *'ద్వార వేధ' అంటే ఏమిటి? దాని ప్రభావం ఏమిటి?*

ఎదురెదురు గడపల మధ్య బిందు స్థానం కలిస్తే 'ద్వార వేధ' ఏర్పడుతుంది. దీనివల్ల 'దిష్టి' దోషాలు ఇంటిని పీడిస్తాయి. అలా ఉంటే 'నర ఘోష' యంత్రం ప్రతిష్టించుకోవాలి.

*కె.చంద్రమౌళి — చెన్నై*

* *ఈశాన్యం బ్లాకు, ఈశాన్యం వీధి చూపు వీటిపైన కూడా ఆరోపణలున్నాయంటున్నారు.*

అది నిజమే! బ్లాకు నిర్మాణాల్లో సరైన వాస్తు పాటించకపోతే చిక్కులున్నాయి. వీధి చూపు మంచిదేనని శాస్త్రాలు చెబుతున్నా, అనుభవంలో వీధి జనుల పది చూపుల్లో 'రెండు' దిష్టికి గురి చేస్తున్నాయి. అందువల్ల ఒకే రోడ్డున్న స్థలాలు ఎంపిక చేసుకోమని చెబుతుంటాను.

*శనగల వసుమతి — తిరుపతి*

* *'జిల్లేడు' చెట్టు ఏ భాగంలో పెంచుకోవాలి?*

జిల్లేడు ప్రహరీ అవతల పెంచుకోవాలి. గృహావరణంలో పెంచరాదు.

*భట్టిమాల అరుణ — బెంగుళూరు*

* *తూర్పు, ఉత్తర స్థలాలను కలుపుకో వచ్చునా?*

గృహ నిర్మాణానికి ముందు కలుపుకోవచ్చు. ఆ తర్వాత కలుపుకోవాలంటే అష్టదిక్ కోణాలను బట్టి సిద్ధాంతి ఆ విషయాన్ని నిర్ధారణ చేస్తారు.

*ఎన్.ప్రయాగశాస్త్రి — తిరుపతి*

* *నేను వాస్తు విద్యార్థిని. ప్రాచీన సంస్కృత శాస్త్రాల్లో వృక్షాల త్యాగనిరతిని గురించి మహర్షులు విశ్లేషించారు.*

ప్రతిఫలాన్ని ఆశించకుండా వృక్షం ఫలాల్ని, కలపని ఇస్తుంది. అదీగాక వృక్షానికి మానవుల మనుగడకు 'సంబంధం' ఉందంటున్నాయి శాస్త్రాలు.

*గంగాధర్ మేడ్చల్ — హైదరాబాద్*

* *మనిషి మనిషికి పూజనీయ వృక్షాలుంటాయట నిజమేనా?*

జన్మరాశి, నక్షత్రాలను బట్టి వృక్షాలు వస్తాయి. వారు ఆయా వృక్షాలను పూజించి లబ్ది పొందాలని వాస్తు శాస్త్రాలు చెబుతున్నాయి. వృక్ష నిర్ధారణలో ఆరోగ్య సూత్రం కూడా ఇమిడి ఉంది.

*జె.పి.విఠలరావు — కడప*

* *అత్యవసర పరిస్థితిలో ఒక వృక్షాన్ని తీసివేయవలసివస్తే ఏం చేయాలి?*

మొదట ఒకటికి పది మొక్కలు నాటి పోషించాలి. అవి బ్రతికిన తర్వాత జన్మనక్షత్రాన్ని బట్టి ఎనిమిది యంత్రాల్లో వచ్చే యంత్రాన్ని ప్రతిష్టించుకుని 'వృక్షపూజ' తర్వాత వృక్షాన్ని తీసివేయవచ్చు.

*బాండవ సరస్వతి — గుంటూరు*

* *పిల్లల వివాహం ఆలస్యమవుతోంది. ఇంటి ప్లాను, జాతకాలు పంపిస్తున్నాను.*

ఇంట్లో నైరుతి, వాయువ్య దోషాలున్నాయి. వాటిని సరిచేసుకోండి. అబ్బాయి, అమ్మాయి జాతక ప్రకారం పగడం, ముత్యం, నీలం, గోమేధుకాలను ఇద్దరికీ ధరింపజేయండి.

*వై.శైలజారెడ్డి — గూడూరు*

* *'తులసి' ప్రతిష్ట గురించి చెప్పండి?*

'తులసి' పెరట్లో శ్రేష్ఠం. ముందు భాగంలో కూడదు. తులసిలోని రసాయనం అమృతతుల్యమనీ, రోగనిరోధకమనీ జైమినీ వాస్తు గ్రంథం చెబుతోంది.

*షేక్ నసీర్ — ఉదయగిరి*

* *మీరు పత్రికలో రాసిన యంత్ర ప్రతిష్ట చేసినా ఫలితం కనిపించడం లేదు.*

అంగట్లో యంత్రాలు ఎలా పని చేస్తాయి భయ్యా! ఇల్లు దిక్కు, మీ పుట్టిన తేది ప్రకారం మంత్ర బీజాక్షరాల చార్టు పంపితే తిరుత్తణి నుంచి తయారుచేసి పంపిస్తారు.

*ఎన్.కుటుంబరావు — నెల్లూరు*

* *ఈశాన్యం 'కుంభ ప్రతిష్ట'ను గురించి మళ్లీ చెప్పండి?*

ఇంట్లో అసాధ్యంగా వేధించే సమస్యలున్నప్పుడు పూజా సామాగ్రి నింపిన 'కుండ'ను మంత్ర యుక్తంగా, ఇంటి స్థలంలోని ఈశాన్యంలో ప్రతిష్టిస్తారు. ఇది శాస్త్ర ప్రకారం చేయాలి.

# కార్పొరేషన్ సొసైటీ కార్మికుల ఆకలి కేకలు!

**నెల్లూరు కార్పొరేషన్‌లో పారిశుద్ధ్య పనులు నిర్వహిస్తున్న 500 మందికి పైగా కార్మికులకు గత మూడు నెలల నుంచి వేతనాలు అందడం లేదు. దీంతో బయట పది రూపాయల వడ్డీకి డబ్బు తీసుకొని బతుకు వెళ్లదీయాల్సిన దుస్థితి దాపురించింది.**


పారిశుద్ధ్య పనుల్లో సొసైటీ కార్మికులు.

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌లో పారిశుద్ధ్య పనులు నిర్వహిస్తున్న సొసైటీ కార్మికులకు గత మూడు నెలల నుంచి వేతనాలు అందడం లేదు. ప్రతి నెలా చేసిన పనికి వేతనాలు చెల్లించకపోవడంతో కుటుంబ పోషణ కోసం బయట అప్పులు చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. వేతనాల చెల్లింపు గురించి పలు దఫాలు అధికారుల దృష్టికి తీసుకెళ్లినా కాలయాపన చేస్తున్నారే తప్ప స్పందించడం లేదని వారు వాపోతున్నారు. కార్పొరేషన్ పరిధిలో దాదాపు 500 మందికి పైగా సొసైటీ కార్మికులు పారిశుద్ధ్య పనులు చేస్తున్నారు. సొసైటీల తరపున నియమించబడిన వీరికి చాలీచాలని వేతనాలు ఇస్తారు. బయట కూలీ పనులకు వెళితే రోజుకు 300 నుంచి 500రూపాయల వరకు గిట్టుబాటు వుంటుంది. నెల మొత్తం పని దొరుకుతుందన్న ఆశతో పురుషులతోపాటు మహిళలు సైతం ఈ పనులకు వెళుతున్నారు.

ప్రతిరోజు ఉదయం తెల్లవారు జాము నుంచి నగరంలో వీధులను శుభ్రం చేయడం, డ్రైనేజి కాల్వల్లో చెత్తను తొలగించడం వాహనాల ద్వారా డంప్‌యార్డ్‌కు తరలిస్తుంటారు. సమాజంలో ఇతర వర్గాలకు చెందిన వారు ఇటువంటి పనులు చేసేందుకు ముందుకు రాని పరిస్థితి. ఈ పనులు చేస్తున్న ఎస్సీ, ఎస్టీలకు కనీస వేతనాలు అమలు చేయడంలో అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించడం బాధాకరం. ప్రస్తుతం వారికి చెల్లించే వేతనం రోజుకు 130 రూపాయలు. పెరుగుతున్న ధరలతో పోల్చుకొంటే ఇది ఏమాత్రం సరిపోదు. సొసైటీ నిర్వాహకులు సైతం కార్మికుల కష్టాల గురించి పెద్దగా పట్టించుకోరు. అధికారులు ఎప్పుడు మంజూరు చేస్తే అప్పుడు అందిస్తామని సర్దిచెబుతుంటారు. తక్కువ మందిని పనిలో పెట్టి ఎక్కువమంది పని చేసినట్లు రికార్డుల్లో నమోదు చేయిస్తుంటారు. వేతనాలు మంజూరు చేసినప్పుడు వాటాలుగా పంచుకుంటారు.

పారిశుద్ధ్య పనులు చేయించేందుకు అవసరమైన సిబ్బందిని నియమించుకునేందుకు కార్పొరేషన్‌కు ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు. రిజిష్టర్ చేయబడిన సొసైటీల ద్వారానే కార్మికులను నియమించుకోవాలన్న నిబంధన వుంది. కార్పొరేషన్‌కు ప్రత్యేకాధికారిగా వున్న అదనపు జాయింట్ కలెక్టర్ స్పందించి సొసైటీ కార్మికుల వేతనాలు చెల్లించేందుకు కృషి చేయాల్సిన అవసరం ఉంది.

## పెద్దగా ఆలోచించను



తెలుగులో ఏక్ నిరంజన్ చిత్రంలో నటించిన హీరోయిన్ కంగనారనౌత్ హిందీ చిత్రాలలో బిజీగా ఉంది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమె పిచ్చాపాటీగా మాట్లాడుతూ అందాలు ఆరబోయడం అనేది పాత్ర తీరుపై ఆధారపడి ఉంటుంది. దాని గురించి పెద్దగా ఆలోచించను. మనం దర్శకుడిని నమ్మి ఓ పాత్ర అంగీకరించాక దేనికైనా సిద్ధంగా ఉండాలి. సినిమా పూర్తయ్యేవరకు దర్శకుడికి పూర్తి సహకారం అందించాలి. అప్పుడే మనపై నమ్మకంతో పాత్రను మలచగలుగుతాడు దర్శకుడు. అది అలా చేయండి; ఇది ఇలా మార్చండి అంటూ మనది కాని పనిలో వేలు పెట్టడం కూడా నాకు నచ్చదు. పరిశ్రమలో కాస్త పెద్ద నోరుతో మాట్లాడుతానని నన్ను అంటుంటారు. నూతిలో కప్పలా బతకడం కంటే స్వేచ్ఛగా జీవించడంలోనే ఆనందముందంటుంది ఈ సుందరి.

## ఐటమ్ భామగా అమీషా!



బద్రి, నాని, పరమ వీరచక్ర చిత్రాలతో తెలుగు ప్రేక్షకులకు చేరువైన నాయిక అమీషా పటేల్. హిందీలోనూ పలు చిత్రాల్లో నటించినా ఇటీవల జోరు తగ్గింది. మళ్లీ పుంజుకొనే ప్రయత్నాల్లో భాగంగా ఐటమ్ పాటలపై దృష్టి పెట్టింది. ఇటీవల ముంబైలో జరిగిన ఓ అవార్డుల ప్రదానోత్సవం కార్యక్రమంలో అమీషా చిక్నీ చమేలీ, ఊ లాలా పాటలకు నర్తించింది. పలువురు దర్శకులు తన నృత్యాన్ని మెచ్చడంతో ఇక ప్రత్యేక పాటల్లో నర్తించాలని నిర్ణయించుకొంది. ఢిల్లీలో జరగబోతున్న ఓ పెళ్లి వేడుకల్లో నర్తించను పెద్ద మొత్తం తీసుకొన్న ఈ భామ వెండితెరపై ఐటమ్ భామగా వెలిగిపోతానన్న ఆత్మవిశ్వాసం వ్యక్తం చేస్తుంది.

## సిక్స్ ప్యాక్ రజనీ?

భాషతో సంబంధం లేకుండా నటుడు రజనీకాంత్‌కు దేశ, విదేశాల్లోనూ అభిమానులున్నారు. కొన్నాళ్ల అస్వస్థత తర్వాత ఆయన 'కొచ్చాదయాన్' చిత్రంలో నటిస్తున్నారు. ఇది త్రీడి సినిమా. రజనీ కుమార్తె సౌందర్య దర్శకురాలు. ఇందులో రజనీకాంత్ సిక్స్‌ప్యాక్‌తో కనిపించనున్నారు. ఈ విషయం ఇటీవల విడుదల చేసిన ఫస్ట్ లుక్ పోస్టర్ ద్వారా వెల్లడయ్యింది. దీనికోసం ఆయన ఎంత శ్రమించారనే విషయాన్ని వెల్లడించడం లేదు. గోప్యత పాటిస్తున్నారు. ఈ చిత్రంలో హీరోయిన్ దీపికా పదుకొణే. దర్శకుడు కె.ఎస్.రవికుమార్. హీరోయిన్ నల్లని మేనిఛాయతో కనపడడం కొసమెరుపుగా

## పెళ్లి ఖరారు



జర్నీ చిత్రం చూసిన ప్రేక్షకులెవరూ ఈ చిత్రంలో కథానాయిక అనన్యను అంత త్వరగా మరువరు. కేరళకు చెందిన అనన్య తొలుత మాతృభాషలోనే నటించింది. తమిళంలోనూ ఆమెకు ఎక్కువగా సాంప్రదాయ బద్ధమైన యువతి పాత్రలే లభించాయి. వాటిలోనూ రాణించింది. త్రిసూర్‌కి చెందిన ఆంజనేయన్ అనే యువకుడికి అనన్య నటన బాగా నచ్చింది. ఈ అభిమానం కాస్తా ఆమెను వివాహం చేసుకోవాలనేంతగా బలపడింది. అతను యువ పారిశ్రామికవేత్త కావడంతో అనన్య తల్లితండ్రులు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చి ఇటీవల కేరళలో నిశ్చితార్థం జరిపారు. ముహూర్తం ఖరారు తర్వాత పెళ్లి జరిగిపోతుంది. పెళ్లి తర్వాత కూడా నటిస్తానంటుంది అనన్య.

## పెళ్లి కాలేదండీ...

హీరోయిన్‌లకు ఎప్పుడు పెళ్లి చేసేద్దామా అని మీడియా తహతహలాడుతుంటుంది. విచిత్రంగా వాళ్లే సంబంధాలు వెతికేసి పెళ్లి చేసేద్దామని చూస్తుంటారు. ముహూర్తాలు కూడా పెట్టేస్తుంటారంది బాలీవుడ్ హీరోయిన్ దియా మీర్జా. ఇటీవల ముంబాయిలో దియామీర్జా త్వరలో పెళ్లి చేసుకోబోతోంది అంటూ ప్రచారం జరిగింది. ఈమె సాహిల్ సంఘ అనే యువకుడిని ప్రేమిస్తుంది. వీరిద్దరూ కలసి ఓ చిత్రాన్ని నిర్మించారు. అప్పటి నుంచి వీరిద్దరి పెళ్లిపై ప్రశ్నలు ఎక్కువయ్యాయి. దీంతో దియాకు వివరణ ఇవ్వక తప్పలేదు. పెళ్లి గూర్చి నేను, అతను ఒక అభిప్రాయానికి రాలేదు. ప్రస్తుతం జానీ మస్తానా అనే చిత్రంలో నటిస్తున్నాను. అలాగే ఓ సినిమా నిర్మిస్తూ ఉన్నాను. దీనివల్ల ఈ యేడాదంతా బిజీ. వచ్చే యేడాది ఆలోచిస్తానంటుంది.



## నిప్పు నీరయ్యింది!



✍ అల్లూరు రహీం




దర్శకులు వైవిఎస్ చౌదరి, గుణశేఖర్, హీరో రవితేజ పూర్వాశ్రమంలో రూమ్‌మేట్స్ అట. పరిశ్రమలో కాస్త వెనుకబడ్డ తన మిత్రులకు లిఫ్ట్ ఇవ్వను నిప్పు చిత్రంలో నటించను ఒప్పుకొన్నట్లున్నాడు రవితేజ. ఈ చిత్రానికి వైవిఎస్.చౌదరి నిర్మాత. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం గుణశేఖర్. వైవిఎస్.చౌదరి దర్శకునిగా మంచి చిత్రాలను తీశాడు. ఒక్కమగాడు ఫట్‌మన్న తర్వాత ఒక్కసారిగా ప్రక్కకు వెళ్లిపోయాడు. గుణశేఖర్, చూడాలని వుంది, ఒక్కడు వంటి చిత్రాలును బాగా తీసిన అనుభవశాలి. మాస్ మహరాజా రవితేజ హీరో అంటే ఆ చిత్రం ఎట్లుండాలి? కాని నిప్పు చిత్రం పేరులో తప్ప కథలో పసలేదు. రవితేజ గతంలో నటించిన చిత్రాల తరహాలో కాసింత వెటకారం, ఇంకాస్త వికారంతో చిత్రకథ నడుస్తుంది. దర్శకుడు ఎటువంటి ప్రయోగం జోలికి పోకుండా చిత్రంలో ఆరు ఫైట్లు, ఆరు పాటలు, ఆరు బ్రహ్మానందం కామెడీ సన్నివేశాలనే మామూలు చట్రానికి పరిమితమయ్యాడు. బిజినెస్ మెన్, బాడీగార్డ్ చిత్రాలకు మంచి సంగీతమందించిన తమన్ ఈ చిత్రానికి సరైన న్యాయం చేయలేకపోయాడు. దూబ.... దూబ, మెజారే చరణంతో సాగే పాటలకు మాత్రం మంచి సంగీత మందించాడు. ఓయ్‌పిల్లా పాటకు 'బృందావనం' చిత్రంలో ఓ పాటకందించిన సంగీతాన్నే రిపీట్ చేశాడు. హీరో రవితేజ చేసిన తొలి ఫైట్‌లో దమ్ములేదు. కాని కంటైనర్లపై ఆయన స్కూటర్ రైడింగ్ బాగుంది. కృష్ణ చిత్రంలో రవితేజ, బ్రహ్మానందం కాంబినేషన్‌లో కామెడీ బాగా పేలింది. నిప్పులో మాత్రం అది నీరయ్యింది. ఆకుల శివ, శ్రీధర్ సిపాన కలిసి వ్రాసిన చావుతో చాటింగ్, భక్తుడు దేవాలయానికి వెళ్లినట్లు ప్రేమికులు పబ్‌కు వెళ్లాలి, నేనే ఒక ఆయుధం, మంచి మనుషులకు ఎప్పుడూ దేవుడు ప్రక్కనే వుంటాడనే డైలాగులు బాగున్నాయి. రవితేజ మాట్లాడే పంచ్ డైలాగులు ఈ చిత్రంలో పండలేదనాలి. సౌదీ అరేబియాతోపాటు తమిళనాడులోని పొల్లాచ్చి అందాలను కెమెరామెన్ సర్వేష్ మురారి ఈ చిత్రంలో బాగానే తెరకెక్కించాడు.

చిత్ర కథలోనికి వెళ్తే హీరో సూర్య (రవితేజ) ఏ లక్ష్యం లేకపోవడమే నా లక్ష్యం అంటూ జాలీగా జీవితం గడిపేస్తుంటాడు. ఆయన నడుపుతుండే జిమ్‌కు వచ్చిన మేఘన (దీక్షాసేథ్)కు ఐ లవ్ యూ చెప్పేస్తాడు. ఆమె పోరా ఇడియట్ అంటుంది. సూర్యాపేట నుంచి వచ్చి హైదరాబాద్‌లో సెటిల్‌మెంట్స్ చేసే రాజా గౌడ్ (ప్రదీప్ రావత్) మనుషులను ఒకసారి కుళ్లబొడిచి వాడితో శత్రుత్వం తెచ్చుకొంటాడు. తన ప్రాణ మిత్రుడు శ్రీరాం (శ్రీరాం) కోసం సౌదీ అరేబియా వెళ్లే సూర్య తిరిగొచ్చేసరికి రాజాగౌడ్ మనుషులు అతని జిమను ధ్వంసం చేస్తారు. కాని సూర్య తన స్వభావానికి విరుద్ధంగా రాజాగౌడ్ జోలికిపోడు. మేఘన, శ్రీరాం చెల్లెలని తెలియడంతో ఆ కుటుంబానికి అండదండలందించడం మొదలు పెడతాడు. శ్రీరాం తండ్రి మూర్తి (రాజేంద్రప్రసాద్) గుండె జబ్బుతో బాధపడుతుంటాడు. ఈ సమయంలోనే ఆయన పెద్దకుమార్తె పెళ్లి ఖరారవుతుంది. శ్రీరాంకు సంబంధించిన పని పూర్తి చేయాలంటూ మేఘనను తీసుకొని సూర్యాపేట బయలుదేరే సూర్య మార్గమధ్యమంలో సౌదీ అరేబియాలో శ్రీరాం ప్రేయసి వైష్ణవి(భావన) మరణించిన కేసులో అతనికి ఉరిశిక్ష పడిందంటాడు. ఇస్లాం షరియత్ ప్రకారం మరణించిన వ్యక్తి తాలూకు తల్లితండ్రులు క్షమాభిక్షకు ఒప్పుకొంటే శిక్ష రద్దవుతుందంటాడు. సూర్యాపేటలో తాము కలవాలనుకొన్న వ్యక్తి పెద్దన్న (ప్రదీప్‌రావత్), తాను హైదరాబాద్‌లో కొట్టిన రాజాగౌడ్ ఒక్కడేనని తెలుసుకొంటాడు. ఫలానా పని కోసం వచ్చానని చెప్పగానే రాజాగౌడ్ ఉగ్రనరసింహమవుతాడు. సామ దాన భేద దండోపాయాలతో గౌడ్‌ను లొంగదీసే సూర్య అంతిమంగా అతని మిత్రుని మరణశిక్షను రద్దయ్యేలా చేస్తాడు. రాజాగౌడ్ పెద్ద కుమార్తె ప్రత్యూషను శ్రీరాం పెళ్లాడడంతో చిత్రం ముగుస్తుంది.

ఈ చిత్రంలో రవితేజ నటనను తప్పుపట్టలేం. హీరోయిన్ దీక్షాసేథ్ కూడా బాగుంది. రాజాగౌడ్‌గా ప్రదీప్‌రావత్ నటన బాగుంది. చిత్రాన్ని ఓ మూస ధోరణిలోనే లాగించడం వల్ల జనం మెచ్చడం లేదు.

# రెవిన్యూ సదస్సులు ప్రారంభం

### భూ సమస్యలు పరిష్కారమయ్యేనా?

జిల్లాలో భూ సమస్యల పరిష్కారం కోసం ఈ నెల 15వ తేది నుంచి రెవిన్యూ సదస్సులు ప్రారంభమైనాయి. నెల రోజులపాటు ఈ సదస్సులు నిర్వహించే విధంగా అధికారులు ప్రణాళికను రూపొందించారు. గ్రామ పంచాయితీ ఉండే ప్రాంతంతోపాటు మరో రెవిన్యూ గ్రామంలో కూడా ఈ దఫా వీటిని ఏర్పాటు చేయాలని అధికారులు భావించారు. గత డిసెంబర్ నెలలో నిర్వహించిన ఈ కార్యక్రమంలో రైతుల నుంచి అధికారులు తీవ్ర నిరసనలు ఎదుర్కోవాల్సి వచ్చింది. గతంలో మండల తహశీల్దార్ కార్యాలయంలో వివిధ సమస్యలపై సమర్పించిన వినతులపై స్పందించని అధికారులు సదస్సుల ద్వారా పరిష్కరిస్తారా అని రైతులు ప్రశ్నిస్తున్నారు. జిల్లా అధికారులు రైతులు ఎదుర్కొంటున్న ప్రతి సమస్యను అక్కడికక్కడే పరిష్కరించాలని ఆదేశిస్తున్నా మండల తహశీల్దార్లు మాత్రం పట్టించుకోని పరిస్థితి. కేవలం పట్టాదారు పాసుపుస్తకాల పంపిణీకి పరిమితమై పోవాల్సి వచ్చింది. ఈ సదస్సుల పుణ్యమా అంటూ తహశీల్దార్, ఆర్ఐ, సర్వేయర్, విఆర్వోలు గ్రామాల్లో తిరుగుతుండగా కార్యాలయంలో అందుబాటులో ఉండాల్సిన మిగిలిన సిబ్బంది విధులకు సక్రమంగా హాజరు కాకుండా ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు.

# ఆగని ఎర్ర చందనం స్మగ్లింగ్!

జిల్లా సరిహద్దుల నుంచి ఎర్ర చందనం భారీగానే తరలిపోతోంది. జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి రహస్య మార్గాల ద్వారా దీన్ని తరలిస్తున్నారు. అటవీ సమీపంలోని గ్రామాలకు చెందిన ప్రజలను ఎర్రచందనం రవాణాకు స్మగ్లర్లు వినియోగిస్తున్నారు. అధికారులు ఎంత నిఘా ఉంచినా ఈ వ్యవహారాన్ని నియంత్రించలేక పోతున్నారు. ప్రతి రోజు ఏదో ఒక ప్రాంతంలో ఎర్రచందనం దుంగలు పట్టుబడుతున్నా వాటి వెనుక ఉన్న అసలు సూత్రధారులు అరెస్టు కావడం లేదు. జిల్లాలో వెంకటగిరి, రాపూరు, డక్కిలి, కలువాయి తదితర మండలాలు ఎర్ర చందనం అక్రమ రవాణాకు కేంద్రాలుగా ఉన్నాయి.

### భయంలేని స్మగ్లర్లు

ఎవరికీ అనుమానం రాకుండా ఉండేందుకు టాటా సుమో, క్వాలిస్ వాహనాలను వినియోగిస్తున్నారు. ఎవరైనా ముందస్తు సమాచారం అందించిన సందర్భంలో మాత్రమే అటవీ శాఖ అధికారులు తనిఖీలు, దాడులు చేస్తుంటారే తప్ప మిగిలిన సమయంలో వీటి గురించి పట్టించుకోరు. దాడుల్లో పట్టుబడిన వాహనాల డ్రైవర్లపై కేసులు నమోదుచేసి చేతులు దులుపుకొంటున్నారు. అసలు స్మగ్లర్లను పట్టుకొనేందుకు ఎటువంటి ప్రయత్నాలు చేయడం లేదన్న ఆరోపణలు ఉన్నాయి. ఇంతే కాకుండా అటవీ శాఖ, పోలీసు శాఖల మధ్య పూర్తిగా సమన్వయం లోపించింది. రెండు శాఖల సిబ్బంది సమన్వయంతో పనిచేస్తే అక్రమ రవాణాను నియంత్రించవచ్చు. దీనిని ఆసరాగా చేసుకుని ఎర్ర చందనం స్మగ్లర్లు మరింత రెచ్చిపోతున్నారు.

# మద్యం మాఫియా గుప్పెట రాష్ట్రం!

### ● తెలుగు మహిళ విమర్శ

మద్యం సిండికేట్లు, రాజకీయ నాయకుల మధ్య సంబంధాలున్నాయని బయటపడిన నేపథ్యంలో ఎసిబి నివేదికను బహిర్గతం చేయాలని తెలుగు మహిళా విభాగం జిల్లా అధ్యక్షురాలు అంచల వాణి డిమాండ్ చేశారు. కలెక్టరేట్ ఎదుట తెలుగు మహిళా విభాగం ఈ వ్యవహారమై ధర్నా చేసింది. ఈ సందర్భంగా అంచల వాణి మాట్లాడుతూ రాష్ట్రం మద్యం మాఫియా రక్కసి కోరల్లో చిక్కుకుందని విమర్శించారు. పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్యనారాయణ తనకు 31 షాపులున్నాయని అంగీకరించారు. ఎక్సైజ్ మంత్రి వెంకటరమణ మద్యం సిండికేట్ల నుంచి లంచం తీసుకోవడంతోపాటు ఆయన కొడుకు పేరుతో రెండు రాష్ట్రాల్లో మద్యం పంపిణీ డీలర్‌షిప్పులు పొందడం నీచాతినీచమన్నారు. ఎసిబి అధికారులు ముఖ్యమంత్రికి ఇచ్చిన నివేదికలో ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, ఎమ్పీలకు మద్యం మాఫియాలతో సంబంధాలున్నట్లు పేర్కొన్న ఆరో పేజీని ముఖ్యమంత్రే తొక్కిపెట్టడం దారుణమన్నారు. ఈ ధర్నాలో మాజీ కార్పొరేటర్ ధర్మవరపు సుబ్బారావు, దోర్నాల హరిబాబు, పెద్దసంఖ్యలో తెలుగు మహిళలు పాల్గొన్నారు.

## ఇందిర క్రాంతి పథం సిబ్బంది ఆందోళన

ఇందిరక్రాంతి పథం సిబ్బంది తమ సమస్యల పరిష్కారం కోసం గత వారంరోజుల నుంచి ఆందోళన చేస్తున్నారు. రాష్ట్రవ్యాప్తంగా ఈ పథకంలో పని చేస్తున్న ఉద్యోగులు విధులను బహిష్కరించి నిరాహార దీక్ష, ధర్నాలు చేస్తున్న ప్రభుత్వం స్పందించడం లేదు. వేతనాలను పెంచిన ప్రభుత్వం సర్వీసును క్రమబద్ధీకరించడంలో కాలయాపన చేస్తూ వస్తుంది. ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని నిరసిస్తూ ఈనెల 13వ తేది నుంచి సమ్మె ప్రకటించారు. ప్రస్తుతం దానిని కొనసాగిస్తున్నారు.

### ● నగరంలో

# సెక్టార్ పోలీస్ స్టేషన్లు!

### గందరగోళంలో ఎస్ఐలు!

జిల్లా ఎస్పీ బి.వి.రమణకుమార్ పోలీసు శాఖలో మార్పులు తీసుకువచ్చేందుకు గత కొన్ని నెలల నుంచి ప్రయత్నాలు చేస్తున్నారు. డిఎస్పీల నుంచి ఎస్ఐల వరకు నెలలో రెండు, మూడు దఫాలు సమీక్షా సమావేశాలు నిర్వహిస్తూ పని విధానాన్ని మరింత మెరుగు పరచుకోవాలని సూచనలు, సలహాలు ఇస్తున్న సంగతి తెలిసిందే. అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న వారిని సైతం తన వద్దకు పిలిపించుకుని ఘాటుగానే హెచ్చరికలు చేస్తున్నారు. ప్రధానంగా నెల్లూరు నగరంలో దొంగతనాలు రోజురోజుకు పెరుగుతూనే ఉన్నాయి. వీటిని నియంత్రించేందుకు సంబంధిత పోలీస్ స్టేషన్ల ఎస్ఐలకు మరిన్ని బాధ్యతలు అప్పగించాలని నిర్ణయించారు. ఇందులో భాగంగానే సెక్టార్ పోలీస్ స్టేషన్ల ఏర్పాటుకు శ్రీకారం చుట్టారు. ఇప్పటివరకు పోలీస్ స్టేషన్లకున్న హద్దులను రద్దు చేశారు. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణంగా హద్దులు నిర్ణయించారు. 5వ నగర క్రైం ఎస్ఐ శ్రీనివాసరావు రైల్వే ట్రాక్ తూర్పు విభాగం, శాంతి భద్రతల ఎస్ఐ శ్రీనివాసులురెడ్డి పడమర వైపు విధులు నిర్వహిస్తారు. నాల్గవ నగర క్రైం ఎస్ఐ మల్లిఖార్జున తూర్పు వైపున, శాంతి భద్రతల విభాగం ఎస్ఐ రామాంజనేయులు పడమర వైపు నియమించడం జరిగింది. ఒకటవ నగర పోలీస్ స్టేషన్ ఎస్ఐ నరసింహారెడ్డి తూర్పు, పడమర వైపు కూడా పర్యవేక్షణ చేస్తారు. 3వ నగర క్రైం ఎస్ఐ బాషా బోసుబొమ్మకు ఉత్తరం వైపు, శాంతి భద్రతల విభాగం ఎస్ఐ నాగేశ్వరరావు దక్షిణం వైపు విధులు నిర్వహిస్తారు. అన్ని పోలీస్ స్టేషన్లలో ఇప్పటివరకున్న క్రైం విభాగం, శాంతి భద్రతల పరిధిలోకి తీసుకొచ్చారు. రాత్రి సమయంలో షిఫ్ట్ పద్ధతిలో విధులు నిర్వహించేందుకు అదనంగా ట్రాఫిక్ ఎస్ఐలను నియమించారు.

# మంత్రులు రాజీనామా చేయాలి!

మద్యం సిండికేట్ల వ్యవహారంలో ఆరోపణలు ఎదుర్కొంటున్న రాష్ట్ర మంత్రులు తమ పదవులకు రాజీనామా చేయకుండా విచారణ జరపమని కోరడం హాస్యాస్పదమని బిజెపి జాతీయ నేత ముప్పవరపు వెంకయ్యానాయుడు విమర్శించారు. ఆరోపణలు వచ్చిన మంత్రులు తమ పదవులకు రాజీనామాలు చేసి నిజాయితీని నిరూపించుకోవాలని డిమాండ్ చేశారు. స్థానిక బిజెపి కార్యాలయంలో పార్టీ మండలాధ్యక్షులు, ఇన్‌ఛార్జీలు, పదాధికారులతో జరిగిన సమావేశానికి ఆయన ముఖ్య అతిథిగా హాజరైనారు. పెరిగిన ధరలను అదుపు చేయడంలో ప్రభుత్వాలు విఫలమయ్యాయని, దీని వల్ల ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారన్నారు. రాష్ట్రంలో ప్రజలు మార్పును కోరుకొంటున్నారని, బిజెపి బలమైన శక్తిగా ఎదిగేందుకు ఇదే సరైన సమయమన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని ప్రజాసమస్యలపై బలమైన ఉద్యమాలు నిర్వహించాలని అప్పుడే పార్టీ బలోపేతం అవుతుందన్నారు. కార్యకర్తలకు ఏ కష్టమొచ్చినా పార్టీ బాధ్యులు ఆదుకోవాలని



సమావేశంలో మాట్లాడుతున్న వెంకయ్యనాయుడు.

సూచించారు. ప్రతి కార్యకర్త కష్టపడి పనిచేస్తే పార్టీకి పూర్వవైభవం రావడం ఖాయమన్నారు. ఈ కార్యక్రమంలో సిక్కిం మాజీ గవర్నర్ వి.రామారావు, బిజెపి రాష్ట్ర అధికార ప్రతినిధులు భానుప్రకాష్‌రెడ్డి, సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి, ఆంజనేయరెడ్డి పాల్గొన్నారు.



# విద్యుత్ కోతలు మొదలు

### అల్లాడుతున్న జనం

జిల్లాలో విద్యుత్ కోతలు మొదలయ్యాయి. వేసవి ఆరంభం కాకమునుపే విద్యుత్ శాఖ కోతల పేరుతో వెతలు పెడుతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. కార్పొరేషన్ పరిధిలో ఉదయం ఒక గంట, మధ్యాహ్నం ఒక గంట కోత విధిస్తుండగా, మునిసిపాలిటీల్లో మూడు గంటలపాటు విద్యుత్ కోత పెడుతున్నారు. మండల కేంద్రాలు, సబ్‌స్టేషన్ హెడ్ క్వార్టర్స్ పరిధిలో నాలుగు గంటలపాటు విద్యుత్ సరఫరా నిలిపి వేస్తున్నారు. చలికాలంపోయి ఇప్పుడిప్పుడే ఎండలు ప్రారంభమవుతున్న తరుణంలో ఉత్పత్తికి మించి వినియోగం వుంటుందనే పేరుతో ఎడాపెడా విద్యుత్ కోతలు పెడుతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ముఖ్యంగా మార్చి నెలలో పరీక్షలు వస్తుండడంతో పదవ తరగతి, ఇంటర్మీడియట్ చదివే విద్యార్థులు ముందు ముందు కోతలు మరింత అధికంగా ఉంటాయని భయాందోళనలు చెందుతున్నారు. ఇక రైతుల సంగతి చెప్పనవసరం లేదు. ఏకధాటిగా ఏడు గంటలపాటు విద్యుత్ సరఫరా చేస్తామని పాలకులు, అధికారులు ఇచ్చిన హామీలు నెరవేర్చకుండా ఇష్టానుసారంగా కరెంట్ కోతలు పెడుతుండడంతో ఎప్పుడు కరెంటు వస్తుందో, ఎప్పుడు పోతుందో తెలియక ఆందోళన చెందుతున్నారు. వీరితోపాటు చిన్నా చితకా పనులు చేసుకునే వారు సైతం ఇబ్బందిపడాల్సి వస్తోంది. ఇప్పుడే ఇలాంటి పరిస్థితి ఉంటే భవిష్యత్తులో ఎండలు తీవ్రమైన స్థితిలో మరింతగా కోతలు ఉంటాయేమోనని ప్రజలు ఆందోళన చెందుతున్నారు.


శివరాత్రి పండుగను పురస్కరించుకొని నెల్లూరు మూలాపేటలోని భువనేశ్వరీ సమేత మూలస్థానేశ్వరుని వైభవం.

## ఈ కేసులు నిన్నేమీ చేయలేవు

మొదటి పేజీ కొరవ

అవినీతి చట్టాలు నీకు వర్తించవు. నీ తండ్రి చేసిన ప్రభుత్వ ఉపకారాలకు ప్రతిగా నీ సంస్థల్లో పెట్టుబడులు పెట్టారనే వాదన సైతం న్యాయ పరిశీలనలో నిలవదు. శిక్ష వేయడానికి కావాల్సిన క్రిమినల్ బాధ్యత నీపై మోపలేరు. క్రిమినల్ చట్టాల ప్రకారం నీ వల్ల నష్టపోయిన బాధితులు, నీపై నేరుగా నేరారోపణ చేసి, సాక్ష్యం చెప్పేనే నేరం రుజువు అవుతుంది. ఎవరో ఇచ్చిన స్టేట్‌మెంట్లు, అఫిడవిట్ల ఆధారంగా కేసు నడపడం చట్టానికి విరుద్ధం. ఆ కారణం చూపి అరెస్టు చేసే ప్రశ్న ఉత్పన్నం కాదు. రాజకీయ ఉద్దేశాలతో అరెస్టు చేసినా సులభంగా బెయిల్ దొరుకుతుంది... అని తేల్చి చెప్పాడట రాంజఠ్మలానీ. విజయసాయి రెడ్డి, సునీల్‌రెడ్డి వంటి జగన్ అనుచరుల మీద పెట్టిన కేసులు సైతం నిలబడవని న్యాయాభిప్రాయం అందజేశాడట. రాంజఠ్మలానీ ఇంత స్పష్టంగా లీగల్ ఒపీనియన్ ఇవ్వడంతో జగన్ శిబిరం ఆనందంతో తబ్బిబ్బు అవుతున్నదిప్పుడు.

అయితే న్యాయ అభిప్రాయాలు, చట్టాలు ఎట్లా వున్నప్పటికీ తనను అరెస్టు చేయడం ఖాయమని జగన్ నమ్ముతున్నాడు. ఇదివరకు తన ఆంతరంగికులతో మాత్రమే తన అరెస్టు చర్చ చేసే వాడాయన. కానీ నాలుగు రోజుల క్రితం జరిగిన ఎమ్మెల్యేల సమావేశంలో అధికారికంగా తన అరెస్టు అంశాన్ని చర్చకు పెట్టాడు. కేసులో బలం లేకపోయినా నన్ను అరెస్టు చేయడం ఖాయం, దానికి మీరంతా సిద్ధంగా వుండండి, నా తల్లి శ్రీమతి విజయమ్మ నేను లేనప్పుడు పార్టీ వ్యవహారాలు చూస్తారు. ఆమె చెప్పినట్లు వినండి... అని తన ఎమ్మెల్యేలకు మార్గదర్శకం చేశాడు జగన్.

అయితే కాంగ్రెస్ శిబిరంలో మాత్రం ఇందుకు పూర్తి భిన్నమైన అభిప్రాయాలు వ్యాప్తిలో వున్నాయి. జగన్‌ను అవినీతి నిరోధక చట్టం క్రింద కాక, మనీ ల్యాండరింగ్ చట్టం ఆధారంగా అరెస్టు చేస్తారు కాబట్టి, ఆయనకు నెలల పర్యంతం బెయిల్ దొరకక పోవచ్చునని, మధు కోడా, సత్యం రామలింగరాజు వలె సుదీర్ఘ కాలం జైలులో వుండక తప్పదని, 2014 ఎన్నికల వరకు కూడా ఆయన బయటకు వచ్చే అవకాశం వుండక పోవచ్చునని భావిస్తున్నారు కాంగ్రెస్‌వాదులు. అంత సుదీర్ఘకాలం జైలులో మ్రగ్గితే రాజకీయ పార్టీ నడపడం అసాధ్యమని వారి భావన. పైపెచ్చు, మనీ ల్యాండరింగ్ చట్టం ప్రకారం జగన్ ఆస్తులు జప్తు చేసి, బ్యాంకు ఖాతాలు స్తంభింప చేస్తారనే వాదన కూడా వీరి నుంచి విన్పిస్తున్నది.

జగన్ అక్రమ ఆస్తుల కేసులో సిబిఐ ఈ నెలాఖరు లోపలే ఛార్జి షీట్ దాఖలు చేయవచ్చునని ఒక అంచనా. ఆ కేసులో జగన్ మొదటి ముద్దాయి కాబట్టి, ఛార్జిషీట్ దాఖలు చేసే సమయానికే ఆయన్ను అరెస్టు చేయక తప్పదని చెప్తున్నారు. ఆ తర్వాత మలిదశలో ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ రంగంలోకి దిగి, మనీ ల్యాండరింగ్ నేరాలు మోపుతుందన్నది సిబిఐ వర్గాల వర్తమానం.

## కన్యకాపరమేశ్వరికి బంగారు చీర

స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకా పరమేశ్వరి మాతకు 20 లక్షల రూపాయలతో బంగారు చీరను రూపొందిస్తున్నట్లు ఆలయ ఛైర్మన్ వెంకటేశ్వర్లు తెలిపారు. తమిళనాడులోని కుంభకోణంలో ఈ చీరను తయారు చేస్తున్నారని త్వరలో అమ్మవారికి అలంకరిస్తున్నామన్నారు. అలానే రెండు కోట్ల రూపాయలతో ఆలయాన్ని పున: నిర్మించేందుకు సన్నాహాలు చేస్తున్నామని చెప్పారు.

## వైఎస్‌ఆర్ పార్టీ స్టీరింగ్ కమిటీ

జిల్లా వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ స్టీరింగ్ కమిటీని నియమించారు. దీంతోపాటు 34 మండలాలకు కన్వీనర్లను నియమిస్తూ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి జాబితా విడుదల చేశారు. 58 మంది స్టీరింగ్ కమిటీ సభ్యులతోపాటు ప్రత్యేక ఆహ్వానితులుగా మరో ముగ్గురిని కలిపి మొత్తం 61 మందిని నియమించారు.

## సంతాప సభ

ఎస్వీ యూనివర్శిటీలో ప్రాచీన భారతదేశ చరిత్ర, కళ, సంస్కృతి శాఖలో పనిచేసి ఇటీవల మరణించిన ప్రొఫెసర్ బి.రాజేంద్రప్రసాద్ సంస్మరణ సభ 26వ తేది డాక్టర్ రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాలలోని మీటింగ్ హాల్‌లో జరుగుతుంది. చరిత్రకారులు డాక్టర్ సి.వి.రామచంద్రరావు, ప్రొఫెసర్ డి.కిరణ్ క్రాంత్, ప్రొఫెసర్ శంకుతల దీనిలో పాల్గొంటారని కార్యక్రమ నిర్వాహకుడు డాక్టర్ కాశీదాసు పురుషోత్తం చెప్పారు.

## డాక్టర్ ద్వారక్‌నాథ్ మరణం

మద్రాసు జనరల్ హాస్పిటల్ ఆస్పత్రి హృద్రోగ విభాగం అధిపతిగా రిటైర్ అయిన డాక్టర్ వి.ద్వారక్‌నాథ్ 17తేది మరణించారు. ఆయన వయస్సు 64 సంవత్సరాలు. ద్వారక్‌నాథ్ మంచి హస్తవాసి కల్గిన డాక్టర్. ఆయన పుట్టుక రీత్యా తమిళుడైనా, నెల్లూరు సాయినాధన్ అండ్ కంపెనీ యజమాని స్వర్గీయ పత్తి నరసింహులు అల్లుడిగా నెల్లూరుజిల్లా వాసులకు సన్నిహితుడైనాడు. పాతికేళ్ళ క్రితం, నెల్లూరులో హృద్రోగ సంబంధిత డాక్టర్ అంటూ లేని రోజులలో, జిల్లా వాసులందరూ చిన్న సమస్య వచ్చినా నేరుగా ఆయన వద్దకు వెళ్లేవారు. వచ్చిన ప్రతిఒక్కరినీ ఆప్యాయంగా పలకరించి, చికిత్స చేసి పంపేవాడు. తన సర్వీసులో దాదాపు మూడువేల గుండె ఆపరేషన్లు చేశాడాయన. అందులో నెల్లూరు, ఒంగోలు జిల్లా వాసుల సంఖ్య 1500 వరకు వుంటుందని అంచనా. తమ ఆస్పత్రిలో ఆయన తెలుగు వారికి అధిక ప్రాధాన్యం ఇస్తున్నారని తమిళులు ఆందోళన చేయడంతో, తమిళనాడు ప్రభుత్వం జనరల్ ఆస్పత్రిలో ఆపరేషన్ చేయించుకోవాలంటే మద్రాసులో నివాసం వున్నట్లు సర్టిఫికేటు సంపాదించాలనే నిబంధన విధించింది. దాన్నిబట్టి ఆయన మన జిల్లావాసుల పట్ల ఎంత శ్రద్ధ కనపరిచారో అర్థం చేసుకోవచ్చు. ద్వారక్‌నాథ్‌కు భార్య, ఒక కుమారుడు వున్నారు. సాయినాధన్ అండ్ కంపెనీ ప్రస్తుత యజమాని పత్తి రవీంద్రబాబుకు బావ గారంటే ఎనలేని ప్రేమ.

## మిఠాయి సింగ్ మరణం

నెల్లూరు ట్రంకురోడ్డులో కమ్మని మిఠాయిల తయారీదారుడిగా అందరికీ సుపరిచితుడైన శ్రీలక్ష్మీ స్వీట్స్ నిర్వాహకుడు ఎన్.సుబ్బుసింగ్(బాబు) 13వ తేది మరణించాడు. సింగ్ వయస్సు 76ఏళ్లు. ఈయనకు భార్య, ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలున్నారు.

అప్తులను కోల్పోయిన పై రెండు కుటుంబాల వారికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### నోటరీగా తంజావూరు!

అడ్వకేట్ నోటరీగా సీనియర్ న్యాయవాది తంజావూరు శ్రీనివాసులును నియమిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. రాష్ట్రంలో 98 మందిని నోటరీలుగా గుర్తిస్తూ న్యాయశాఖ ఉత్తర్వులు జారీచేస్తే నెల్లూరు నుంచి తంజావూరు శ్రీనివాసులు ఒక్కరి పేరే ఉంది. శ్రీనివాసులు 1984లో న్యాయవాదిగా వృత్తిలో ప్రవేశించారు. సీనియర్ న్యాయవాది సూర్యప్రకాశరావు వద్ద అసిస్టెంట్‌గా పనిచేశారు. 1989 నుంచి దక్కన్ క్రానికల్ పత్రికకు లీగల్ కంట్రిబ్యూటర్‌గా కూడా పనిచేస్తున్నారు. పేద, మధ్యతరగతీయులకు అందుబాటులో ఉండే న్యాయవాదిగా పేరు తెచ్చుకొన్నారు.

### ఎల్.ఎల్.ఎఫ్‌లో గమనం సలహాలు!

ప్రముఖ న్యూరోలింగ్విస్టిక్ ప్రోగ్రామర్ గమనం 19వ తేది నెల్లూరు వేదాయపాళెంలోని లిల్లీ లిటిల్ ఫ్లవర్ స్కూల్లో విద్యార్థులు, ఉపాధ్యాయులు, పిల్లల తల్లితండ్రులతో ఏర్పాటుచేసిన ప్రత్యేక సమావేశంలో మాట్లాడారు. పిల్లలను ర్యాంకర్లుగా, చదువుపట్ల విముఖత చూపే పిల్లలను దానిపట్ల శ్రద్ధ పెంపొందింపచేయడంలో తల్లితండ్రులు ఎటువంటి పాత్ర పోషించాలో చెప్పారు. ఈ సమావేశంలో స్కూల్ కరస్పాండెంట్ ఇసి నారాయణరెడ్డి, పాఠశాల డైరక్టర్ కృష్ణచైతన్య పాల్గొన్నారు.



### పట్టపగలు దోపిడీ

ఆత్మకూరు బస్టాండ్‌లో ఆటో ఎక్కి లేక్‌వ్యూ కాలనీలో గల ఇంటికి వెళ్తున్న మిరపకాయల వ్యాపారిని దోపిడీ చేసిన ఘటన ఇటీవల జరిగింది. కొండయ్య అనే వ్యాపారి మిరపకాయలు అమ్మగా వచ్చిన సొమ్ము 78వేల రూపాయలను తీసుకొని ఆటో ఎక్కగా మధ్యలో పోలీసులు తనిఖీ చేస్తున్నారంటూ ఆటో డ్రైవర్ మినీ బైపాస్ వైపు దారి మళ్లించి టిడిపి ఆఫీసు వద్ద జన సంచారంలేని చోటుకు తీసుకెళ్లి కత్తులతో బెదిరించి దోపిడీ చేశాడట. ఆటో డ్రైవర్‌తోపాటు మరో వ్యక్తి ఈ దోపిడీకి పాల్పడినట్లు బాధితుడు పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

### ఎస్‌ఎంఎస్ యూనిట్

ఎస్‌ఎంఎస్ సినిమా నటీనటులు నెల్లూరు విచ్చేశారు. 16వ తేది ఆ చిత్రం ప్రదర్శింబడుతున్న లీలామహల్‌కు హీరో సుధీర్‌బాబు, హీరోయిన్ రెజీనా, హాస్యనటులు చంటి తదితరులు వచ్చి ప్రేక్షకులతో ముచ్చటించారు. వీరికి థియేటర్ యాజమాన్యం ఎస్-2లో భోజన ఏర్పాట్లు చేసింది.

### పిల్లలతో అశ్లీల నృత్యాలా?

పసి పిల్లలతో సినిమాల ఐటెం పాటలకు డ్యాన్స్ చేయించడం పట్ల న్యాయమూర్తులు ఆగ్రహించారు. చైల్డ్ అండ్ పోలీస్(క్యాప్) ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న పాఠశాలకు చైల్డ్ వెల్ఫేర్ కమిటీకి చెందిన న్యాయమూర్తులు విచ్చేశారు. ఈ సందర్భంగా పిల్లలచే అశ్లీల నృత్యాలు చేయించడాన్ని చూసి అక్కడే ఉన్న వారు నిర్వాహకులపై మండిపడ్డారు. దీనికి వసంతలక్ష్మి చారిటబుల్ ట్రస్ట్ నిర్వాహకులు సర్దిచెప్పబోగా వారు శాంతించలేదు. ఇలాంటి వాటిని ఎలా ప్రోత్సహిస్తారంటూ ప్రశ్నించడంతో స్టేజి మీదున్న ఎస్పీతో సహా పలువురు అధికారులు మిన్నకుండి పోవాల్సి వచ్చింది.

## కోవూరు ఉపఎన్నిక

16వ పేజీ కొరవ

దంటే, ఈ ఉప ఎన్నిక పట్ల ఆయనకు ఎంత ఆసక్తి వుందో అర్థం చేసుకోవచ్చు. పార్టీని గెలిపించే బాధ్యతను మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఆదాల ప్రభాకర్‌రెడ్డిల మీద మోపాడు. మండలానికొక ఇన్‌ఛార్జ్‌ను నియమించాడు. దాదాపు ప్రతి రోజూ ఎన్నికల వ్యవహారాలను స్వయంగా తెలుసుకోవడానికి సిఎం పేషీలో ఒక ఓఎస్‌డిని నియమించాడు. గత ఆరు నెలల్లో దాదాపు అరడజనుసార్లు కోవూరులో సర్వే జరిపించాడట ముఖ్యమంత్రి. తాజాగా వచ్చిన సర్వే ఫలితాల ప్రకారం జగన్ పార్టీకి, కాంగ్రెస్‌కు మధ్య చాలా కొద్ది తేడా మాత్రమే వుందని తేలిందట. ఆ సర్వే నివేదికను పార్టీ జిల్లా నేతలందరికీ చూపించి, మీరు సమైక్యంగా, గట్టిగా పనిచేస్తే మనం తప్పక గెలుస్తామని ఉత్సాహపరచి పంపాడు ముఖ్యమంత్రి. ఆయన ఆశ ఎంత మేరకు నెరవేరుతుందో వేచి చూడాలి.

## జనవాణి

2వ పేజీ కొరవ

బాగుంది. సంపాదకుడు డోలేంద్రప్రసాద్ వ్రాసినట్లు ఐఎఎస్‌ల వ్యవస్థ ఎంతగా భ్రష్టుపట్టి పోయిందీ అర్థం చేసుకోవడానికి ఇప్పుడు మన రాష్ట్రంలో జరుగుతున్న పరిణామాలు చూస్తే చాలు. ఐఎఎస్‌లలో ఏ కొంతైనా నిజాయితీ మిగిలివుంటే సిబిఐ దర్యాప్తుకు సహకరించి ఐఎఎస్‌లు తమ ప్రతిష్టను కాపాడుకోవాలి.

కె.పెంచలయ్య, కొడవలూరు

### ఐఎఎస్‌లదే తప్పంటే ఎలా?

జమీన్‌రైతు ఫిబ్రవరి 10తేది సంచికలో నిజమైన దోషులు వారే శీర్షిక పేరిట ప్రచురితమైన సంపాదకీయంలో రాష్ట్రంలో ఇప్పటివరకు జరిగిన అవినీతి అక్రమాలలో తప్పంతా ఐఎఎస్‌లదేనని వ్రాశారు. ఎస్.ఆర్.శంకరన్, సుజాతారావు, జన్నత్ హుస్సేన్, కొప్పోలు రాజు వంటి ఐఎఎస్ అధికారులు ఈ తరంలో చాలా తక్కువే. ఇప్పటి రాజకీయ నాయకుల్లో, మంత్రుల్లో నిజాయితీ లేదు. ఐఎఎస్‌లను బంట్రోతుల మాదిరి ఉపయోగించుకొని దర్యాప్తుల సమయంలో మాత్రం వాళ్లనే బాధ్యులు చేస్తున్నారు. ఐఎఎస్‌లు చెడిపోవడానికి రాజకీయ వ్యవస్థ కారణమని చెప్పక తప్పదు.

డి.బుచ్చయ్య, నెల్లూరు

## పదరంగం -3

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | | | | 3 | | 4 |
| 5 | | | | | 6 | | | | 7 | |
| | | | 8 | | | | 9 | 10 | | |
| | | 11 | | 12 | | | 13 | | | |
| 14 | | | | 15 | 16 | | | | | 17 |
| | | | 18 | | | | 19 | | 20 | |
| 21 | | | | | | 22 | | 23 | | |
| | | | | | 24 | | 25 | | | 26 |
| 27 | | | | 28 | | | | | 29 | |
| | | | | | | | 30 | | | |
| 31 | | 32 | | | | 33 | | | | |

**అడ్డం**

2. ఇది ఉంటే అన్నింటా జయమే (4)
3. కత్తి ఒర (3)
5. శరీరమే (3)
6. దివిటీ (3)
7. నదిని దాటించేది (2)
9. తెలుగు మేల్ (2)
11. చిన్న అడ్డంకి (3)
13. పాదం, లైను (3)
14. నాట్యంలో ఒక రీతి (3)
15. జయించినవాడు (3)
20. అరవై నిమిషాలు, వాయించేది (2)
21. ఈశ్వరుడే (5)
22. ఒక యాగం (4)
25. గరళం (2)
27. బ్రాహ్మణుడు (3)
28. రెండవ (2)
30. ఈ భేధాలు వుండకూడదు (4)
31. తెలుగు హైడ్రోజన్ (4)
33. సవాల్, ఒక సినిమా పేరు (1)

**నిలువు**

1. ఉత్తరాంధ్ర దేవుడు ఎన్టీఆర్ సినిమా (11)
2. వంటింటి దినుసు (2)
4. కాపలా, ఒక ఊరి పేరు కూడా (3)
6. క్రింద నుంచి పని (2)
8. ఎగతాళి (2)
10. విషం (3)
11. మృగానికి వికృతి (2)
12. కవిత్వం వ్రాసేవాడు (2)
13. క్రింద నుంచి హిందీ చర్మం (3)
16. పెద్దవాడు (2)
17. ఫ్లేమ్, మిరపకాయ రుచి (2)
18. పెండ్లి కొడుకు (3)
19. అలెగ్జాండరు బిరుదు (5)
20. వాసన, శాండల్ (2)
23. మేక (2)
24. సంపద (3)
26. పటుత్వం (3)
29. రెలిజియన్ (3)
32. క్రింద నుంచి జడత్వం కలవాడు (3)

**సమాధానాలు**

## పదరంగం -2

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | క్ష | 2 య | పా | 3 త్ర | | | 4 వై | 5 ఖా | న | 6 స |
| భి | | తి | | 7 యో | గం | | | క్రీ | | వ |
| 8 జ్ఞా | నం | | 9 సా | ద | | 10 ని | ల | వ | నీ | రు |
| 11 న | ది | | | 12 శి | ర | శ్ఛే | ద | నం | | |
| శా | | | 13 స్పె | | | ష్ట | ణ | | | 14 స్టె |
| 15 కుం | త | లా | లు | | 16 ప | డు | 17 గు | 18 స్పె | 19 క | |
| త | | | | 20 ఏ | ది | | | ని | ర | 21 ఆ |
| 22 లం | బో | ద | రు | డు | | 23 కో | తి | | 24 వా | లం |
| | | | | 25 చి | కో | రి | | 26 వి | లం | బ |
| 27 సు | రు | చి | | హ్నా | | 28 క | వ | ల | | న |
| 29 కృ | ష్ణ | పా | దా | లు | | | 30 ని | యం | త | |

# సంక్షిప్త సింహపురి

## పీడకలల భయం... దొంగలకు వరం!

ఇంట్లో పడుకుంటే పీడకలలు వస్తున్నాయని భయపడి తన తల్లి ఇంట పడుకొంటున్న మహిళ ఇంట్లో దొంగలుపడి లక్షా 70వేలు దోచుకొన్న ఘటన నెల్లూరు కుక్కలగుంట ప్రాంతంలో జరిగింది. అరటిపాముల సుమతికి కుక్కలగుంటలో స్వంత ఇల్లు ఉంది. ఇంట్లో రాత్రుళ్లు పడుకొంటే పీడకలలు వస్తున్నాయని కామాటి వీధిలోని తన తల్లి ఇంటికి తన ఇద్దరు బిడ్డలతో రాత్రి పూట వెళ్లి పడుకొనేది. ఇది బాగా గమనించిన దొంగలు తాళాలు పగులగొట్టి బీరువాలో ఉన్న లక్షా 70వేల రూపాయలు విలువ చేసే సొత్తును దోచుకెళ్లారు. ఆమె ఇచ్చిన ఫిర్యాదు మేరకు వన్‌టౌన్ పోలీసులు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

## కలెక్టర్ బంగ్లాలో ప్రవేశానికి ఆంక్షలు!




ప్రజలను బయట ప్రాంతాలకు వెళ్లి మరీ పలుకరించే జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి నివసించే బంగ్లాలో ప్రవేశానికి ఆంక్షలు పెట్టారు. గతంలో గ్రామీణ ప్రాంతాలకు చెందినవారు ఉదయం పూట కలెక్టర్‌ను బంగ్లాలో కలిసి తమ సమస్యలు చెప్పుకొనేవారు. ఇప్పుడు అక్కడ క్యాంప్ క్లర్క్‌గా పనిచేసే రాజేశ్వరరావు తన అనుమతి లేకుండా బంగ్లాలోనికి ఎవరినీ రానివ్వవద్దని ఆంక్షలు విధించారట. దీంతో బంగ్లా గేటు వద్ద ఉండే సెక్యూరిటీ కలెక్టర్ దర్శనానికి వచ్చే సామాన్యులను అపాయింట్‌మెంట్ ఉందా అని ప్రశ్నిస్తున్నాడు. అదేమిటని తెల్ల మొఖం వేస్తున్న వారిని కలక్టరేట్‌కు వెళ్లి కలెక్టర్‌ను కలవమంటున్నాడు. సామాన్యులెవరికీ రాజేశ్వరరావు ఫోన్ నెంబరు తెలియదు. ఆయన అపాయిమెంట్ తీసుకోలేరు. కలెక్టర్ గారు ఈ వ్యవహారంలో ఆంక్షలు తొలగిస్తే బాగుంటుంది.

## అధికార తెలుగు అనువాదకుడు

ప్రజల భాషలో పరిపాలన వైపు ప్రభుత్వం అడుగులు వేస్తుంది. అందులో భాగంగా ముఖ్యమైన ప్రభుత్వ ఉత్తర్వులను, ప్రతులను తెలుగులో అనువాదం చేయించి ప్రజలకు అందుబాటులో ఉంచాలని నిర్ణయించింది. దీనికిగాను ప్రభుత్వ పాఠ్య గ్రంధకర్త విద్వాన్ కిరణశ్రీని తెలుగు అనువాదకునిగా నియమించింది. ఈయన చాలా కాలంపాటు నెల్లూరు సిఎంఎం స్కూల్‌లో ప్రథమశ్రేణి తెలుగు పండితునిగా పనిచేశారు. గతంలో ప్రభుత్వ సంబంధ అనేక పాఠ్య పుస్తకాలు రచించారు. తెలుగు పదకోశ నిర్మాణంలోనూ సహాయకుడిగా పనిచేశారు.

## నారపుశెట్టి నారాయణకు పదవి



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ రిటైర్డ్ ఎంప్లాయిస్ అసోసియేషన్ రాష్ట్ర సంఘ ఎన్నికలు హైదరాబాద్‌లోని ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాలులో జరిగాయి. ఈ ఎన్నికలలో నెల్లూరీయుడు, ఎన్జీఓల సంఘ మాజీ నాయకుడు నారపుశెట్టి నారాయణ రాష్ట్ర ఆర్గనైజింగ్ సెక్రటరీగా ఎన్నికయ్యారు. ఆయన ఈ పదవిలో మూడేళ్లపాటు ఉంటారు. విశ్రాంత ఉద్యోగుల సమస్యల పరిష్కారానికి కృషిచేస్తానని నారాయణ చెప్పారు.

## ఎపిజెయూ నూతన కార్యవర్గం

రాష్ట్రంలో రెండు జర్నలిస్ట్ సంఘాలు ఎపియూడబ్ల్యుజె, జాప్, ఎపియూడబ్ల్యుఎఫ్ ప్రముఖమైనవి. కొందరు తెలివిగల జర్నలిస్టులు ఎపియూడబ్ల్యుజె పేరులోని రెండక్షరాల తేడాతో ఎపిజెయూ సంఘాన్ని స్థాపించారు. నెల్లూరులో ఈ సంఘం ఎపియూడబ్ల్యుజెతో పోటీపడుతూ 16వ తేది నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొంది. జిల్లా అధ్యక్షునిగా జాలె వాసుదేవనాయుడు, పి.శరత్ చంద్ర, ప్రధాన కార్యదర్శిగా తంబయ్య నాయుడు, కార్యనిర్వహణాకాధికారిగా టి.వి.ప్రసాద్, సంయుక్త కార్యదర్శిగా పి.జాన్‌విజయం, కోశాధికారిగా వి.రవీంద్రనాథ్‌రెడ్డిని ఎన్నుకొన్నారు. వీరంతా వివిధ చిన్న పత్రికలు, స్కూళ్ల నిర్వాహకులు కావడం విశేషం.

## నగరమా... నరకమా?



ఇదేమీ సినిమా పాట పల్లవి కాదు. బిజెపి కార్యకర్తలు నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ కమిషనర్‌కు సమర్పించిన వినతి పత్రంలో సంధించిన ప్రశ్న. బిజెవైఎం అధ్యక్షుడు చిలకపాటి శ్రీనివాసులు నేతృత్వంలో బిజెపి కార్యకర్తలు ఇటీవల కమిషనర్‌ను కలిశారు. నగరం నరకంగా మారింది. పట్టపగలే దోమలు వీరవిహారం చేస్తున్నాయి. ఎక్కడికక్కడ చెత్త పేరుకపోయి ఉంది. డ్రైనేజీలు శుభ్రపరిచే వాళ్లులేరు. ఎక్కడ చూసినా దుర్గంధం, వీధిలైట్లు వెలగవు. రోడ్లపై నడక దేవుణ్ని గుర్తుకు తెస్తుందని వాపోతూ ఏయే ప్రాంతాల్లో ఎంత అధ్వాన్నంగా ఉన్నాయో వివరంగా వినతి పత్రంలో పేర్కొన్నారు. ఈ కార్యక్రమంలో బిజెవైఎం నగర ఉపాధ్యక్షుడు పావళ్ల శివ, శనగవరపు శ్రీనివాసులు, తోట మల్లిఖార్జున, కార్యకర్తలు ఎం.కేశవ్, బ్రహ్మయ్య, ఈశ్వరయ్య, రాజ్‌కుమార్, హుస్సేన్ బాషా తదితరులు పాల్గొన్నారు.



## రైతు లోకం: వరినాశించే తెగుళ్లు - నివారణ చర్యలు!

జిల్లాలో వరి వెన్నుతీసే దశలో ఉంది. వరిపై మంచు బాగా కురవడం కారణంగా తెగుళ్లు కూడా వ్యాపించే అవకాశం ఉంది. వీటి నుంచి వరిని రక్షించేందుకు అవసరమైన క్రిమి సంహారక మందులను వ్యవసాయశాఖ అధికారుల సూచనలు, సలహాల మేరకు వాడాల్సి ఉంటుంది. ఎరువులను అధికంగా వాడితే అధిక దిగుబడులు వస్తాయని కొందరు వ్యాపారులు రైతులకు సూచిస్తుంటారు. వారి వ్యాపారాన్ని మరింత పెంచుకునేందుకు ఇటువంటి సలహాలు ఇస్తుంటారన్న విషయాన్ని కొందరు రైతులు గమనించడం లేదు. వరికి వివిధ దశలలో తెగుళ్లు వ్యాపించకుండా ముందుగానే అన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. జిల్లావ్యాప్తంగా కొన్ని మండలాల్లో అగ్గి తెగులు, మెడ విరుపు తెగులు, ఆకు ఎండు తెగుళ్లు వున్నాయి.

### అగ్గి తెగులు, మెడ విరుపు తెగులు

ఈ తెగుళ్లు సోకిన ఆకులపై ముదురు గోధుమ రంగు అంచుతో మధ్యలో బూడిద రంగు గల నూలు కండె ఆకారపు మచ్చలు ఏర్పడతాయి. అనంతరం ఆకులు ఎండిపోయి తగుల బడినట్లు కనిపిస్తాయి. వెన్నుల మెడ భాగంలో ఈ తెగులు ఆశించటం వల్ల వెన్నులు విరిగిపోతాయి.

### నివారణ

తెగుళ్లను తట్టుకొనే శక్తిగల వరి వంగడం సాగుకు కిలో విత్తనానికి మూడు గ్రాముల కార్బండైజిమ్‌ను కలిపి విత్తన శుద్ధి చేయాలి. ట్రైసైక్లోజోల్ 75 శాతం 0.6 గ్రాములు లేదా ఐసోప్రోథమొలీన్ 1.5 మిల్లీ లీటర్లు లీటరు నీటికి కలిపి పైరుపై పిచికారి చేయాలి. చేనులోను, గట్లపైనా కలుపు నివారించాలి.

### ఆకు ఎండు తెగులు

ఇది బ్యాక్టీరియా వల్ల వస్తుంది. ఆకు అంచుల నుంచి పసుపు రంగు నీటి డాగు మచ్చలుగా ఏర్పడి ఆకుపై నుండి క్రిందికి ఎండిపోతుంది.

డాక్టర్ రవీంద్రకుమార్ రెడ్డి,
ప్రధాన శాస్త్రవేత్త & కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

### నివారణ

దీనిని తట్టుకొనే శక్తి వరి వంగడం సాగుకు ఆరోగ్యవంతమైన పంట నుండి విత్తనాన్ని సేకరించాలి. నత్రజని యాజమాన్యం (3-4సార్లు వేయడం) తప్పక చేయాలి. తెగులు ఐదు శాతం కంటే ఎక్కువగా ఉంటే నత్రజని వేయడం తాత్కాలికంగా నిలుపుదల చేయాలి. ప్రస్తుతం దీని నివారణకు ఎటువంటి మందులు లేవు.

# ప్రతిష్టాత్మకంగా మారిన కోవూరు ఉపఎన్నిక!

## ● మూడు పార్టీలకు చావు బతుకుల సమస్య

కోవూరు ఉప ఎన్నికలకు మూడు పార్టీలు రణభేరి మ్రోగించాయి. అభ్యర్థులను నిర్ణయించి, ప్రచార కదన రంగంలోకి దుమికాయి. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి 25తేది నామినేషన్ వేయబోతున్నాడు. తెలుగుదేశం పార్టీ అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి ఈ రోజు (24తేది) నామినేషన్ దాఖలు చేస్తున్నాడు. కాంగ్రెస్ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తన ముహూర్తాన్ని 27తేదిగా నిర్ణయించుకొన్నాడు. సిపిఎం పార్టీ కూడా నామకార్థపు పోటీకి సిద్ధపడుతున్నది. వూరు పేరు లేని అనామకుడైన వెంకమ రాజు అనే కార్యకర్తను అభ్యర్థిగా ప్రకటించింది. అయితే వారు చివరివరకు రంగంలో వుంటారా అన్నది అనుమానం. హైదరాబాదులో రాష్ట్రస్థాయిలో చంద్రబాబు, రాఘవులు మధ్య ఏదైనా చర్చలు, సంప్రదింపులు జరిగి చివరి నిముషంలో ఉపసంహరణ జరిగినా ఆశ్చర్యపోవలసిన అగత్యం లేదు.

మామూలు పరిస్థితులలో అయితే ఈ ఉప ఎన్నికలకు విలువే వుండవలసిన అవసరం లేదు. శాసనసభ పదవీకాలంలో ఇప్పటికే మూడేళ్లు గడచిపోయాయి. గట్టిగా రెండేళ్లు కూడా లేని వ్యవధికి ఎమ్మెల్యేగా గెలిచి ఎవరు సాధించేది ఏమీ వుండదు. పార్టీల పరంగా చూసినా కూడా ఏ ఒక్క ఎమ్మెల్యే గెలిచినా, ఓడినా శాసనసభలో బలాబలాల విషయంలో ఇసుమంత తేడా కూడా రాదు. కానీ రాష్ట్రంలో ప్రస్తుతం నెలకొని వున్న రాజకీయ పరిస్థితుల దృష్ట్యా మూడు పార్టీలకు ఈ ఉపఎన్నిక ప్రతిష్టగా పరిణమించింది. ఆ ప్రతిష్టా సమస్యకు కేంద్ర బిందువు – వైఎస్.జగన్.

జగన్ స్వంత కుంపటి వెలిగించుకొన్నప్పటి నుంచి కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల అస్థిత్వం ప్రమాదంలో పడింది. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి అకాల మరణానికి సానుభూతి తెల్పాలన్న కోరికతోనో లేక ఆయన చేసిపోయిన మేలుకు కృతజ్ఞత చెల్లించుకోవాలన్న భావనతోనో తెలియదు కానీ జగన్‌ను రాష్ట్ర ప్రజలు విపరీతంగా అభిమానిస్తున్నారు. ఓదార్పు యాత్ర పేరిట ఆయన చేస్తున్న యాత్రలకు పెద్దసంఖ్యలో హాజరౌతున్నారు. కడప ఉప ఎన్నికలో చరిత్ర ఎరుగని మెజార్టీతో జగన్‌ను గెలిపించారు. ఈ నేపథ్యంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ ప్రభావం ఓటర్ల మీద ఎంత వరకు వుంటుంది, ఎంతకాలం నిలుస్తుంది అన్న చర్చ విస్తృతంగా జరుగుతున్నది. ఎవరికి తోచిన వాదనలు వారు చేస్తున్నారు. ఈ భిన్న వాదనలలో ఏది సరైనదో తేల్చుగల్గిన వారు ఓటర్లు మాత్రమే. అందుకొక వేదిక కల్పిస్తున్నది కోవూరు ఉప ఎన్నిక.

ఏ కారణం వల్లనో జగన్ తెలంగాణ ప్రాంతంలో జరిగే ఉప ఎన్నికలలో పోటీ చేయడానికి వెనుకడుగు వేశాడు. రాష్ట్రంలో మొత్తం 7 స్థానాలలో ఉప ఎన్నికలు జరుగుతుంటే ఒక్క కోవూరులో మాత్రమే పోటీకి సిద్ధపడ్డాడు. 2014 ఎన్నికలలో ముఖ్యమంత్రి పీఠం అధిష్టించాలనే తమకంతో తపన పడుతున్న జగన్, 119 స్థానాలున్న తెలంగాణలో పోటీకి వెన్ను చూపడం ఏ రకమైన రాజకీయవ్యూహమో అర్థం కాని విషయం. అక్కడ ఓడిపోతామన్న భయంతోనే పోటీకి వెనుకాడాడన్న భావన ప్రజలలో ప్రచారం కావడం వల్ల పార్టీకి ఖచ్చితమైన నష్టం తప్పదు.

అందువల్లనే కోవూరు ఉప ఎన్నికను చావు బ్రతుకుల సమస్యగా తీసుకొంటున్నాడు జగన్. ఇక్కడ గెలవలేకపోతే ఇక రాష్ట్రంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు




భవిష్యత్తే వుండదన్నది ఆయన భయం. అందువల్లనే రాష్ట్రం మొత్తం మీద తనకున్న నేతలందరినీ కోవూరు ఎన్నికల నిర్వాహకులుగా తరలిస్తున్నాడు. కాకాణి గోవర్ధన్‌రెడ్డిని వారందరికీ సమన్వయ కర్తగా నియమించాడు. అయితే అసలు సమస్య ప్రసన్న మీద ఆ పార్టీ కార్యకర్తలలో తీవ్ర వ్యతిరేకత వుంది. దాన్ని చక్కదిద్దుకోవడం పెద్ద సమస్యగా వుంది. ప్రసన్న మాత్రం, నన్ను గెలిపించే బాధ్యత మీదే కాబట్టి, ఆ తంటాలేవో మీరే పడండి అన్న ధీమాతో కులాసాగా కాలం గడిపేస్తున్నాడు.

తెలుగుదేశం అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చాలా ఉత్సాహంగా వున్నాడు. కాంగ్రెస్ ఓటు బ్యాంకును కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్‌లు చీల్చుకొంటాయని, తెలుగుదేశం ఓట్లన్నీ తనకు గంపగుత్తగా పడతాయి కాబట్టి, తానే గెలుస్తానని నమ్మకంగా వున్నాడు. జిల్లాలో తెలుగుదేశం పార్టీకి చంద్రమోహన్‌రెడ్డి తిరుగులేని నాయకుడు. ఆయన్ను వ్యతిరేకించేవారు ఎవరూ లేరు. పార్టీలో చీకాకులేమీ లేవు. చంద్రబాబు కూడా కోవూరులో తెలుగుదేశాన్ని గట్టెక్కించగలిగితే తప్ప రాష్ట్రం మొత్తం మీద పార్టీ యంత్రాంగంలో నైతిక స్థైర్యం పెంచలేమన్న భావనతో వున్నాడు. అందువల్ల ఆయన కూడా ఏ ప్రయత్నాన్ని విస్మరించకుండా ఎన్నికల సమరంలో హోరాహోరికి సమాయత్తమవుతున్నాడు.

కాంగ్రెస్ సంగతి చెప్పనే పని లేదు. కోస్తా మొత్తంలో జరిగే ఏకైక ఉప ఎన్నిక ఇది. కడప ఉప ఎన్నికతో కాంగ్రెస్ చాలా ఢీలా పడిపోయి వుంది. కార్యకర్తలలోనే కాదు, ఎమ్మెల్యేలలో కూడా తమ పార్టీ మీద నమ్మకం లేదు. భవిష్యత్తు మీద ఆశ లేదు. ఈ నిరాశాపూరిత వాతావరణాన్ని వైదొలగించి, పార్టీలో ఉత్తేజం నింపాలంటే కోవూరులో పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డిని గెలిపించి తీరాలి. దానితో ముఖ్య మంత్రి తెలంగాణలో జరిగే ఆరు ఉప ఎన్నికలను పక్కనపెట్టి తన శక్తి యుక్తులన్నిటినీ కోవూరు మీద కేంద్రీకరించాడు. డబ్బు దస్కం తానే సమకూరుస్తానని కూడా హామీ ఇచ్చా

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com